

# ఆంధ్రసచిత్రవారపత్రిక

7-1-72 50 పైసలు

## ఆరోగ్యమును కావాలనుకొనే వారు వివా అంటే యిష్టపడతారు

**ఆరోగ్య పానీయపు తయారులో ఒక ఘనమైన సాధన—వివా!**

వివా ప్రతి చెంచాలోను ప్రోటీనుయొక్క ఆరోగ్యము, కార్బోహైడ్రేటుయొక్క శక్తి, పాల మీగడ సారము మరియు మాల్టుయొక్క మంచి గుణము యిమిడి ఉన్నాయి.

**వివా, ఆరోగ్యకరమైన తేలికగా జీర్ణమయే పోషణకు**

వివా పగలంతా ఎంతో శక్తిని, రాత్రంతా సుఖమైన విశ్రాంతిని యిస్తుంది. త్వరగా కరిగే కార్బోహైడ్రేట్లు, సులభముగా జీర్ణమయే ప్రోటీన్లుగల వివా రోగులకు, రోగమునుండి కోలుకొంటున్న వారికి దివ్యమైన పుష్టికరమగు ఆహారము. మీ డాక్టరును అడగండి, ఆయన అదే సలహా యిస్తారు.

# వివా

రెండు విధములుగా ఆరోగ్యమును కలిగించే పానీయము






"వివా, మొట్టమొదటి గొప్ప రుచిగల ఆరోగ్య పానీయము."

21225

చలం సమర్పించు శ్రీరమణ చిత్ర వారి

# బుల్లెమ్మ బుల్లోడు

దర్శకత్వం: నాగాంజనేయులు

రచన: రాజశ్రీ, సంగీతం: సత్యం, కెమెరా: ఆర్ మధు, ఎడిటింగ్: అంకిరెడ్డి, ఆర్టు: సోమనాథ్

శ్రీ ఫిలింస్





పాఠకులకి, రచయిత (త్రు) లకి
మా కొత్త సంవత్సర శుభాకాంక్షలు
—సం॥

# ఉత్తరాలు

## 'హెక్సాక్లోరోఫిన్'వల్ల ప్రమాదం?

'హెక్సాక్లోరోఫిన్' అనే రసాయన పదార్థాన్ని ఇప్పుడు ఎన్నో 'టాయిలెట్' వస్తువులలో వాడుతున్నారు. సబ్బులలో, షేవింగ్ క్రీములలో, టూత్ పేస్టులలో, టాల్కమ్ పవుడర్లలో చిన్న పిల్లల వళ్ళు శుభ్రం చేసేందుకు ఉపయోగించే ద్రవ్యాలలో హెక్సాక్లోరోఫిన్ కలుపుతూ ఉంటారు, ఎందరో కంపెనీలవారు.

ఇటీవల ఈ పదార్థం 3%పయిన ఉండే సాధనాలని చిన్నపిల్లలకి వాడితే మెదడు దెబ్బతింటున్నదని నిరూపించే పరిశోధనలు తెలిపాయి. సుప్రసిద్ధ అమెరికా వారపత్రిక 'టయిమ్స్'లో దీని వివరాలు కొన్నివేశారు. (20—12—1971 తేదీ సంచిక.)

హెక్సాక్లోరోఫిన్ ఎలా ఉపయోగించాలో ఉత్పత్తిదారులు సూచిస్తూ ఉంటారు. ఈ సూచనలని జాగ్రత్తగా అనుసరిస్తే ప్రమాదం ఉన్నట్లు రుజువు లేదని 'టయిమ్స్' పత్రికలో ఉంది. దాని అర్థం ఏమిటో తెలియదుకాని హెక్సో క్లోరోఫిన్‌కి సంబంధించిన పూర్తి సమాచారం బయటపడే దాకా మన ప్రభుత్వం వారు తగిన చర్య తీసుకొనటం అవసరం.

ఒక చదువరి (మదరాసు.)

* * *

1947 లో పాకిస్తాన్ ఏర్పడక ముందునుంచి కూడా జాతీయోద్యమాన్ని నడుపుతూ వచ్చిన కాంగ్రెసు నాయకులలో కొందరు అల్ప సంఖ్యాకుల పట్ల అవలంభించవలసిన విధానాలని గురించి కొన్ని నమ్మకాలు ఉండేవి. ఈ నమ్మకాలవల్ల ఎక్కువ నష్టపోయింది అల్ప సంఖ్యాకులే అని నా నమ్మకం!

మన నాయకులు అధిక సంఖ్యాకులకే వర్తించే సంస్కరణలు ఎన్నో తీసుకు వస్తున్నారు కాని, కారణాలు ఏమయినప్పటికీ, తక్కువ సంఖ్యకలవారి జోలికి పోకుండా ఉంటూ వచ్చారు. దీని ఫలితంగా అభివృద్ధి, సంస్కరణ కొన్ని వర్గాలలో బాగా లోపించాయి. వెనుకబడి ఉండటం వారికి అలవాటయిపోయింది.

పైన చెప్పినట్లు, నష్టపడేది ఈ వర్గాలవారే అయినప్పటికీ వారు వెనుకబడిపోవటం వల్ల మిగతా వారందరికీ కూడా కష్టం కలుగచేస్తూ వచ్చారు. సమాజంలో కొందరు మాత్రం తమ ఆరోగ్య రక్షణకి కావలసిన జాగ్రత్తలు తీసుకొనకపోతే తక్కిన వారికి ప్రమాదం కదా?

ఈ విషయాలన్నీ అందరికీ తెలిసినవే. కాని ప్రజాస్వామ్యంలో వోట్లు ఎట్లా వస్తాయో అని భయపడి కొందరు నాయకులు మూఢనమ్మకాల ప్రభావానికి లోనయి సంస్కరణ, అభివృద్ధి వద్దనే కొన్ని వర్గాల నాయకుల నత్తిడికి లొంగిపోతూ వచ్చారు.

డిశంబరు 1971 లో జరిగిన భారత—పాకిస్తాన్ యుద్ధంలో పాత జంకు మొహమాటాలు వదులుకునేందుకు తగినంత అవకాశాలు వచ్చాయి.

ఇక మన నాయకులు భయం లేకుండా దేశంలో వారందరికీ సమానంగా వర్తించే శాసనాలు, చట్టాలు అమలు పరచాలి. ఆస్తి, వివాహం, విడాకులు మొదలయిన వాటికి సంబంధించినంతవరకూ భారతదేశంలో అన్ని మతాల, వర్గాల వారికి ఒకే చట్టం ఉండాలి.

అప్పుడే దేశ ప్రజలందరికీ న్యాయం చేకూర్చిన వారు అవుతారు మన నాయకులు. యుద్ధంలో ఆయుధాలకి భయపడనివారు మాటలకి భయపడ నవసరం లేదు.

—ఎ. వాణి, (మదరాసు.)

* * *

డా. కొలచల వెంకటకృష్ణమూర్తి సంస్కృత కళాశాల, అరండేల్‌పేట, గుంటూరు ప్రిన్సిపాల్. శ్రీ యేలూరిపాటి అనంతరామయ్యగారు ఈ క్రింది విధంగా వ్రాస్తున్నారు:—

ప్రాచ్యకళాశాలల విద్యార్థులలో తెలుగులో కవిత్వ రచనను ప్రోత్సహించుటకై మా కళాశాలలో 17—1—1972వ తేది మధ్యాహ్నము గం2.00 లకు పోటీ నిర్వహింపబడును. ఇచ్చిన విషయమును గూర్చి అభ్యర్థులు ఒక గంట వ్యవధిలో సలక్షణ భాషా ఛందములలో వ్రాయవలసి యుండును. ఎంట్రన్సులో సహా కళాశాలలోని అన్ని తరగతుల విద్యార్థులును పాల్గొనదర్హులు. ఒక కళాశాల నుండి ఎందరైనను సొంత ఖర్చులపై రావచ్చును. ఉచిత వసతి విద్యార్థినులకు ప్రత్యేక వసతి కలదు. రు. 50, 30, 20 ల విలగల కొరిన పుస్తకములు ప్రథమ, ద్వితీయ, తృతీయ బహుమతులుగ యోగ్యతాపత్రములతోసహా 18—1—72 సాయంకాలము గం 4—30ని.లకు జరుగు కళాశాల సంస్థాపకుల జన్మదినోత్సవ సభలో బహూకరింపబడును. నిరుడీ బహుమతులు వరుసగా కొవ్వూరు, తిరుపతి, గుంటూరు విద్యార్థులకు లభించినవి. ప్రిన్సిపాల్ నియమముపై వివరణములు ఉండవు. రాదలచిన అభ్యర్థులు తమ దరఖాస్తులు 10—1—72వ తేదీ కందునట్లు పంపి తమతో తమ కళాశాల ప్రిన్సిపాల్ నుండి ధ్రువపత్రము తెచ్చుకొనవలెను.

—యేలూరిపాటి అనంతరామయ్య.

# ఉత్తరాలు

## కథలు

వాయుని కృష్ణ కుమారి గారి కథ 'గౌయ్య' చదివాను. అతి చిన్న సంఘటనతో కథను నడిపించిన రచయిత్రి నేర్పు ప్రశంసనీయం. కథకుడికి వచ్చినట్టుగా రాసిన కల అత్యంత వాస్తవికంగా వుంది కాని రచయిత్రి కథను అర్ధాంతరంగా వదిలేసారేమో ననిపించింది. మరికాస్త పొడిగిస్తే బాగుండేది——

——పర్సా వాసుదేవరావు (ఖమ్మం.

*　　*　　*

దీపావళి కథల బాలట్ పోటీ—మూడవ బహుమతి పొందిన వ్యాసరచయిత్రి కుమారి పాలంకి కల్యాణిగారు పంపిన ఫోటో, ఉత్తరం ఈకింద వేస్తున్నాము— సం.

'జననం 21.10.53 తేదీని మద్రాసునగరంలో విద్యాభ్యాసం హైదరాబాదు నగరంలోని స్టేట్ రల్స్ హైస్కూల్ మాడపాటి హనుమంతరావు బాలికోన్నత పాఠశాలలో. 12వ తరగతిలో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణురాలినై, ప్రస్తుతం హైదరాబాదులోని విశ్వవిద్యాలయ మహిళా కళాశాలలో బి. ఎస్. సీ. మొదటి సంవత్సరం చదువుతున్నాను. ఆంధ్ర సచిత్ర వారపత్రిక, ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక, పాలికేక, విశ్వరచన మున్నగు పత్రికలలో నేను రచించిన కథలూ వ్యాసాలూ, గేయాలూ ప్రచురించ బడ్డాయి. ఆకాశవాణి హైదరాబాదు కేంద్రం నుంచి నా కవితలూ, కథలూ సాహిత్య



కుమారి పాలంకి కల్యాణి

సమస్యలూ ప్రసారమయాయి. రంగ స్థలనటన, నృత్యం, వ్యాస రచన పోటీలలో బహుమతులు లభించాయి.' ❀




# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు

దేశోద్ధారక కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం, 7-1-72'

శ్రీ విరోధికృన్నామ సం॥ పౌష మా॥ బహుళ సప్తమి

సంపుటము : 6? సంచిక : ?0

స్థాపితము :

1908

ముఖ్య సంపాదకుడు :

శివలెంక శంభుప్రసాద్

ఆంధ్రపత్రిక కార్యాలయము

7, తంబుచెట్టి వీధి. మద్రాసు - 1

విడి ప్రతి వెల 50 పైసలు

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 31.20 |
| 6 మాసముల చందా | 15.60 |
| 3 మాసముల చందా | 7.80 |


## విషయానుక్రమణిక


ఈ మంటలని ఆర్పడానికి ప్రయత్నించాలి
వియత్నాం
ప్రపంచం
1972


ఇప్పటి శాంతి పరిస్థితిని ఉపయోగించుకుని మరోయుద్ధానికి కాలుదువ్వు


మంచి పొరుగు
స్నేహ సంపద
స్నేహ సంపద
భారత-బాంగ్లాదేశ్‌ల సరిహద్దు


పగటి కల
తూరుపు పాకిస్తాన్

### రాజధాని కబురు

# రాష్ట్రంలో అధికార కాంగ్రెస్‌కి అనుకూల వాతావరణం

యుద్ధం ముగిసింది మన రాష్ట్రంలో మళ్ళీ యథావిధిగా రాజకీయ ఊహాగానాలు జోరుగా జరుగుతున్నాయి. ముఖ్యమంత్రి అప్పుడే ఢిల్లీ చేరుకున్నారు ఆయన తిరిగి రాక పూర్వమో లేక వచ్చిన తరువాతనో ప్రదేశ కాంగ్రెసు అడ్‌హాక్ సంఘం నియామకం గురించి ఢిల్లీ నుంచి ప్రకటన వెలువడ వచ్చును. కాని ప్రదేశ కాంగ్రెసు వ్యవస్థ సంపూర్ణత్వాన్ని పొందక పూర్వమే, జిల్లా కాంగ్రెసు సంఘాల వారిని కాంగ్రెసు అభ్యర్థుల గూర్చి సిఫార్సులను పంపవలసిందిగా అ. భా. కాం. సంఘం కార్యాలయం వారు కోరారు. నిజానికి రాష్ట్రం ప్రస్తుత మున్నటువంటి వాతావరణంలో కాంగ్రెసుకు పటిష్టమైన వ్యవస్థ ఉన్నా లేకపోయినా, ఎన్నికల్లో కాంగ్రెసు విజయం తథ్యమని భావించవలసి ఉంది. ప్రస్తుతం ఇందిరా గాంధి గారికి దేశమంతటా ఉన్న పేరు ప్రతిష్టలు అలాంటివి. ఆమె ముద్ర ఉన్న ఏ అభ్యర్థి అయినా సునాయాసంగా గెలిచి పోతాడని చెప్పుకుంటున్నారు. ఈ పరిస్థితిలో అభ్యర్థి యోగ్యతా యోగ్యతలకు అతని ఆర్థిక స్తోమతకు ప్రాముఖ్యత మృగ్యమై పోయింది. ఎన్నికలంటే, ముఖ్యంగా సర్కారు జిల్లాల్లో ధనం గుప్పించ గలగడంపైన విజయం ఆధారపడి ఉంటుంది. కాని అధికార పక్షానికి, పాకిస్తాన్‌లో జరిగిన యుద్ధంలో దేశం సాధించిన మహత్తరమైన విజయం మూలంగ అపారమైన ప్రాబల్యం పలుకుబడి కలిగింది. కాగా కాంగ్రెసు టికెట్టుకు అదివరకు లేని ప్రాముఖ్యత ఈ నాడు కలిగింది. ధనం నీళ్ళలా వెచ్చించ గలిగిన శక్తి సామర్థ్యాలు ఉన్నవారు కూడా ఈ రోజుల్లో పార్టీ టిక్కెట్టు కొరకే విశ్వప్రయత్నం చేయాలను కుంటున్నారు.

ఎన్నికలు వచ్చే రెండు నెలలలోగానే జరుగ బోవడం ఇతర పార్టీలకంటే అధికార పార్టీకే అనుకూలంగా ఉండబోతున్నాయి.




పిల్లలని మంచి పౌరులుగా తీర్చిదిద్దడానికి పశ్చిమ జర్మనీ చిన్నపిల్లలకి శిక్షణ నిస్తున్నది. ట్రాఫిక్ నిబంధనలని ఎలా గమనించి రోడ్డుమీద నడవాలో పిల్లలకి, పెద్దలకి కూడా తెలియజెప్తున్న 8 ఏళ్ల అమ్మాయిని చిత్రంలో చూడవచ్చు. —(యు. పి. ఎస్-డాడ్)

## ధరల పెరుగుదల

రాజకీయ పరిస్థితి ఇలా ఉంటే ఆర్థిక రంగంలో పద్నాలుగు రోజుల యుద్ధం ప్రభావం ఇప్పుడిప్పుడే ప్రజల జీవనం పైన పడుతున్నది. ఆహార పదార్థాల ధరలు, కూరగాయల ధరలతో సహా బాగా పెరిగి పోతున్నాయి. కిరసనాయిలు బియ్యం, చక్కెర వీటి ధరలు సామాన్యుడి శక్తికి మించి పెరుగుతున్నాయి. దీనికి తోడు ప్రభుత్వం కొత్త పంట మార్కెట్టుకు రాగానే బియ్యం సేకరణ ప్రారంభంలోనే హెచ్చుగా చెయ్యా లనుకుంటున్నది. బంగ్లాదేశంలో కరువు ఏర్పడ కుండా ఉండడానికై మన దేశంలో ముఖ్యంగా వరిసాగు హెచ్చుగా ఉన్న రాష్ట్రాల్లో ధాన్యం సేకరణ చేసి బంగ్లాదేశానికి సరఫరా చేయాలని కేంద్ర ప్రభుత్వం ఆదేశించింది. ఈ సంవత్సరం అనావృష్టి మూలంగా పంట నష్టం కలిగినప్పటికీ మన అవసరాలకు మించే ఉత్పత్తి జరిగి ఉంటుందని అధికారుల అంచనా. కనుక బంగ్లా ప్రజల సహాయార్థం మన రాష్ట్ర ఉత్పత్తిలో కొంత భాగం ప్రత్యేకించడం అసాధ్యమైన దేమీ కాదు. కాని స్వరాష్ట్రంలో ఆహార ధాన్యాల పంపిణీ సక్రమంగా జరిగి పట్టణ ప్రాంతాల్లో ఇబ్బంది కలగకుండా ఉండాలంటే ప్రభుత్వం ప్రధానమైన పట్టణాలన్నింటిలో కార్డుల ద్వారా పంపిణీ పద్ధతిని ప్రవేశ పెట్టవలసి ఉంటుంది. ఇక్క

దుకాణాల ద్వారా ధాన్యం అమ్మకం నిర్ణీతమైన ధరకు అమ్మకం జరిపించాలంటే ధాన్యం సేకరణ బాగా చేయవలసి ఉంటుంది. సేకరణ కూడా రైతుల నుంచే నేరుగా జరుగుతే బాగుంటుంది. కాని మిల్లర్ల పాత్రను ఈ ప్రభుత్వం నిర్లక్ష్యం చేసే స్థితిలో ఉన్నట్టు కనిపించదు. రైతుల ఆగ్రహానికి గురి కావలసి వస్తుందేమో నన్న. క్రితం కొన్ని సంవత్సరాలనుంచి ప్రభుత్వం మిల్లర్ల ద్వారా లెవీ ధాన్యాన్ని సేకరిస్తున్నది. లెవీ ధరకు బియ్యం సరఫరా చేసినందుకు మిల్లర్లకు కొంత భాగాన్ని ఓపెన్ మార్కెట్లో అమ్ముకొనడానికి లేదా పొరుగు రాష్ట్రాలకు ఎగుమతి చేసుకొనడానికి పర్మిట్లు ఇచ్చే విధానాన్ని కూడా ప్రభుత్వం అనుసరిస్తున్నది. ఇందువల్ల క్రితం సంవత్సరం రాష్ట్ర అవసరాలను పూర్తిగా విస్మరించి, బియ్యం ఇతర రాష్ట్రాలకు తరలి పోవడానికి దోహదం కలిగింది. గత రెండు మాసాల నుండి మన రాష్ట్రంలో బియ్యం కొరత ఏర్పడడానికి ధరలు పెరిగి పోవడానికి ఇదే కారణం. ఐనా కూడా సరఫరాల మంత్రి పల్లా సుబ్బారాయుడుగారు మిల్లర్లపైనే ధాన్యసేకరణకు ఆధారపడాలని నిర్ణయించుకున్నారు.

## కొత్త మార్పు!

పల్లా సుబ్బారాయుడుగారు సివిల్ సప్లైస్ శాఖను చేపట్టిన తరువాత ప్రభుత్వపు సేకరణ విధానంలో మార్పు రాకపోయినా మరొక ముఖ్యమైన మార్పు కనిపిస్తున్నది. క్రితం రెండు సంవత్సరాలు అధికార పక్షం రాజకీయ నిధులను పోగుచేయడానికే ఈ శాఖ వినియోగపడింది. ఇప్పుడు ప్రజావసరాలను తీర్చడానికి చిత్తశుద్ధితో ప్రయత్నం జరుగుతున్నదని చెప్పవచ్చును. మంత్రిగారు ఈ మధ్య రాజధాని నగరంలో కొన్ని చౌకధర దుకాణాలను హఠాత్తుగా సందర్శించి తనిఖీ చేశారు. ప్రభుత్వ విధానాలకూ నాటి ఆచరణకూ మధ్య ఎంతతేడా ఉంటుందో మంత్రి గారికి అవగాహన జరిగి ఉంటుంది. రాష్ట్ర రాజధానిలోనే కాక ఇతర జిల్లా కేంద్రాల్లో కూడా చౌక దుకాణాల ద్వారా పంపిణీ కోసం విడుదల అవుతున్న బియ్యం దుర్వినియోగం జరుగుతున్నది. పల్లా సుబ్బారాయుడు గారు ప్రభుత్వ యంత్రాంగంలో, ముఖ్యంగా విజిలెన్స్ సెల్‌లో కొత్త ప్రాణాన్ని పోయగలిగితే తప్ప బ్లాక్ మార్కెటు బారి నుంచి ప్రజల పరిరక్షణ జరగదు.

## జిల్లాస్థాయిలో సంఘాల ఆవశ్యకత

యుద్ధం మూలంగా దేశంలో ఏర్పడిన అత్యవసర పరిస్థితిలో సమాజంలోని వివిధ భాగాలు ముఖ్యంగా వర్తకులు పారిశ్రామిక వేత్తలు ముందుకు వచ్చి ధరలు పెరగకుండ ప్రభుత్వంతో సహకరిస్తామని వాగ్దానాలు చేశారు. కాని యుద్ధం ముగియగానే సరి సహకార భావంలోకాని, సహకారాన్ని పొందడం గూర్చి ప్రభుత్వ వైఖరిలోగాని మార్పు రాకూడదు. రాష్ట్ర పౌర రక్షణ సమితి ఆలస్యంగా నైనా ఏర్పడింది. అందులో ఇతర విషయాలతో పాటు ధరల పెరుగుదలను, దొంగ నిల్వలను నిరోధించేటందుకు ఒక సంఘం ఏర్పడింది. అందులో వర్తకులూ ఉన్నారు. ఇతర్లూ ఉన్నారు. ఈ ఉప సంఘం సభ్యుల సహకారంతో దురాచారాలను అరికట్టడానికి నగరంలో మంత్రి యత్నిస్తున్నారు. ఇలాంటి సంఘాలు జిల్లా స్థాయిలో కూడా అవసరం.

—బి. నాగేశ్వరరావు

## 1971 ఉత్తమ హాస్యనటుడు





జనరల్ మానెక్ షా



ఎయిర్ ఛీఫ్ మార్షల్ లాల్



అడ్మిరల్ నందా

# బంగ్లా విముక్తిపోరాటంలో మన అతిరధులు మహారధులూ

## జనరల్ మానెక్ షా

మానెక్‌షా పూర్తిపేరు శామ్‌హారముజీ ఫ్రామ్‌జీ జేమ్‌షెడ్‌జీ మానెక్‌షా 1914 ఏప్రిల్ మూడవతేదీన అమృతసర్‌లో జన్మించారు 1934లో ఆర్మీలో చేరారు. మొదటి ప్రపంచయుద్ధంలోను రెండవ ప్రపంచయుద్ధంలోనూ ఉత్సాహమైన పాత్ర తీసుకున్నారు. 'పద్మభూషణ్'గా గౌరవం పొందారు. జనరల్ మానెక్‌షా ఇంపీరియల్ డిఫెన్స్‌కాలేజి (యు. కె.)లో పట్టభద్రుడు

## లెఫ్టినెంట్ జనరల్ అరోరా

జగ్‌జిత్‌సింగ్ అరోరా 1917 ఫిబ్రవరి పదమూడవ తేదీన జన్మించారు 1938 జనవరిలో పంజాబ్ రిజిమెంట్‌లో చేరారు. రెండవ ప్రపంచయుద్ధంలో పాల్గొన్నారు ఆర్మీహెడ్ క్వార్టర్స్‌లోని మిలటరీ ట్రయినింగ్‌కి డైరెక్టరుగా కూడా కొంతకాలం పనిచేశారు. అరోరా పంజాబ్ రెజిమెంట్‌కి కల్నల్.

## లె. జనరల్ భగత్

పి. యస్. భగత్ 1918 అక్టోబరు 14న జన్మించారు 1939లో ఇంజనీరింగ్ కార్ప్స్‌లో ప్రవేశించారు. రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో మిడిల్‌ఈస్ట్‌లో వున్నారు. ఆసమయంలో మనసైన్యానికి 'విక్టోరియా క్రాస్' లభించడానికి కారకులు ఆయనే లెఫ్టినెంట్ రల్ భగత్ సిఖ్ లైట్ ఇన్‌ఫెంట్రీకి కల్నల్.

## లె. జనరల్ బెవూర్

గోపాల్ గురుముక్ బెవూర్ 1916 ఆగస్టు 11న జన్మించారు 1936లో ఆర్మీలో ప్రవేశించారు పర్సనల్ సర్వీసెస్‌కి డైరెక్టరుగా కూడా కొంతకాలం పనిచేశారు. 1969లో వీరికి పరమ విశిష్ట సేవా మెడల్ లభించింది

## లె. జనరల్ కేండెత్

కున్హిరామ్ పాలత్ కేండెత్ 1916 అక్టోబరు 23న కేరళలోని ఒక నాయర్ కుటుంబంలో



ఎయిర్ మార్షల్ దివాన్



వైస్ అడ్మిరల్ క్రిష్ణన్



లె. జనరల్ కేండెత్

జన్మించారు. 1937లో ఇండియన్ మిలటరీ ఎకాడమీలో ప్రవేశించారు. 1963లో పరమ విశిష్ట సేవా మెడల్‌ని పొందారు. ఆర్టిలరీ రిజిమెంట్‌కి ఆయన కలనల్ కమాండర్.

## అడ్మిరల్ నందా

ఎస్. ఎమ్. నందా 1915లో జన్మించారు. 1941లో రాయల్ ఇండియన్ నావల్ వలంటరీ రిజర్వ్‌లో జాయినయ్యారు. అంతక్రితం కరాచీలోని పోర్ట్ ట్రస్ట్‌లో పనిచేశారు. బొంబాయిలోని మజగాంవ్ డాక్, నావల్ డాక్ యార్డ్‌ల అభివృద్ధికి ఆయన దోహదం చేశారు. 1961లో అతివిశిష్ట సేవా మెడల్‌ని అందుకున్నారు. 1966లో పరమ విశిష్ట సేవా మెడల్ కూడా లభించింది.

## వైస్ అడ్మిరల్ క్రిష్ణన్

యస్. క్రిష్ణన్ 1919 జూన్ ఎనిమిదవ తేదీన జన్మించారు. 1935లో 'డఫరిన్‌లో' చేరారు. 1971 నుంచి విశాఖపట్నంలో ఫ్లాగ్ఆఫీసర్‌గా వుంటున్నారు. పరమ విశిష్ట సేవా మెడల్‌ని పొందారు. యు. కె. లో జాయింట్ సర్వీస్ స్టాఫ్ కోర్స్‌లో పాల్గొన్న ప్రప్రథమ భారతీయుడు ఈయనే.



లెఫ్టినెంట్ జనరల్ అరోరా

## వైస్. అడ్మిరల్ కొహ్లీ

సురేంద్రనాథ్ కొహ్లీ పంజాబ్‌లో జన్మించారు. 1936లో కెడెట్‌గా నేవీలో చేరారు. కమ్యూనికేషన్ స్పెషలిస్ట్‌గా శిక్షణ పొందారు. న్యూఢిల్లీలోని నేషనల్ డిఫెన్స్ కాలేజీకి కమాండెంట్‌గా కూడా పనిచేశారు.

## ఎయిర్ ఛీఫ్ మార్షల్ లాల్

ప్రతాప్ చంద్రలాల్ 1916 డిశంబరు 6న లూధియానాలో జన్మించారు. 1969 జూలైలో వాయుసేనకి ఛీఫ్‌గా నియమింపబడ్డారు. రెండవ ప్రపంచయుద్ధ సమయంలోఆయన చదువు ఆగిపోయింది. వాయు సేనలో చేరే క్రితం ఆయన విమానాలని నడపడం హాబీగా నేర్చుకున్నారు. ఆయన సేవలకి ప్రతిఫలంగా ఫ్లయింగ్ క్రాస్ లభించింది. ఇండియన్ ఏయిర్ లైన్స్ కార్పొరేషన్‌కి జనరల్ మేనేజరుగా పనిచేశారు. పద్మభూషణ్ బిరుదాన్ని అందుకున్నారు.

## ఎయిర్ మార్షల్ దివాన్

హెచ్. సి. దివాన్ లాహోర్‌లో చదువుకున్నారు. 1940లో వారు సేనలో ప్రవేశించారు. విదేశాల్లో శిక్షణ పొందారు. రెండవ ప్రపంచ సంగ్రామ సందర్భంలో జర్మనీ మీద బాంబులు వేసిన ఉద్యమంలో వీరూ వున్నారు.

## ఎయిర్ మార్షల్ ఇంజినీర్

మినూ మెర్వాన్ ఇంజినీర్ 1921 జనవరి 1వ తేదీన జన్మించారు. 1940లో ఏయిర్ ఫోర్స్‌లో ప్రవేశించారు. మహావీరచక్రని పొందించారు. పరమ విశిష్ట సేవా మెడల్‌ని పొందారు. ●

# ఒకవారం విపరీతం

## రణరంగంగా మారిన కార్పొరేషన్ సమావేశం

డిశంబరు 8వ తేదీ బెంగుళూరు మేయో హాలులో జరిగిన కార్పొరేషన్ సమావేశంలో కోలాహలం పుట్టి క్షణాలమీద అది రణరంగంగా మారిపోయిందట. బెంగళూరులో వున్న కొన్ని రోడ్లను అర్జంటుగా బాగు చేయవలసిందని ప్రభుత్వం కార్పొరేషన్‌కు వుత్తరం రాసిందట. ఈ వుత్తరాన్ని సభలో చదివి వినిపించమనో సభ్యుడు కోరాడట. ఆ వుత్తరం చదవడానికి కమిషనరుకు హక్కులేదని కొత్త కాంగ్రెసువారంతా అరిచారట. మిగతావాళ్ళు చదివితీరాలనీ, కాంగ్రెసువారంతా ఆ వుత్తరం చదవ వీల్లేదని వుత్సాహంగా కేకలు వేసుకున్నారట అంతతో ఆగక, కమీషనరును నానా మాటలూ అని కొత్త కాంగ్రెసువారు గలాటా చేశారట. అప్పటికీ సంతృప్తి చెందక వో కొత్త కాంగ్రెసు ఆయన కమీషనరుమీద కలబడ్డానికి విజృంభించారట ఆ చర్యను ఆపటానికి కొందరు కమిషనరు చుట్టూ చేరి, గోడగా నిలబడ్డారట. ఈ సందర్భంలో కమీషనరును గనుక తక్షణం బదిలీ చేయించకపోతే, తామంతా రాజీనామా యిస్తామని, యిచ్చితీరుతామని, వో 24 మంది కొత్త కాంగ్రెసు సభ్యులు అన్నారట.

## ప్రాణం పోయేలోగా పాక్ విమానాన్ని కూల్చిన భారత వీర సైనికుడు!

శ్రీనగర్ సైనికస్థావరం మీద పాకిస్తాన్ విమానంలోంచి వో గుండుపడి, ఆర్ముగం అనే అతని తల దూసిందట రివ్వున. తనతలమీంచి వరదలుగా నెత్తురుకారుతున్నా సరే ఆర్ముగం లక్ష్యపెట్టక, చేతిలోని తుపాకితో గురిచూసి, పాకిస్తాన్ విమానాన్ని కాల్చికూల్చేశాడట. తను కాల్చిన విమానం ధ్వంసం అవడం చూసి అతను కన్నుమూశాడట.

## భారతకెప్టెన్ సాహసం!

పాకిస్తాన్ శత్రువులను ఎదిరిస్తూ ఫాజిల్కా ప్రాంతంలో యుద్ధం చేస్తున్న భారత వీరులలో కెప్టెన్ సోవ్‌దత్ అనే ఆయన తన ప్రాణాలకు తెగించి తన స్థావరం నుంచి శత్రుస్థావరానికి దొర్లుకుంటూ వెళ్ళి, చేతి కందినవారిని చంపి, అక్కడ నుంచి ఎం.ఎం.జి (మీడియం మెషిన్‌గన్) లను, మందు గుండు సామానును తీసుకుని అతి సురక్షితంగా తిరిగి తన స్థావరానికి చేరుకున్నాడట.

## అధ్యాపకులులేని కళాశాల!

అనంతపురానికి చెందిన మడకశిరలో ప్రభుత్వ జూనియర్ కళాశాలలో 172 మంది విద్యార్థులున్నారటగానీ ఒక్క అధ్యాపకుడు గాని, చివరికి ప్రిన్సిపాలుగాని లేరట. వూరు వూరంతా యూనియం మీద ఎన్ని విజ్ఞాపనలు చేసినా ఫలితం శూన్యమయిందట. ఆఖరి ఆయుధంగా విద్యార్థులు శాంతియుత సమ్మెను సాగుతున్నారట—దట్స్ రైట్— తమసోమాజ్యోతిర్గమయా!




## అంగారకుని ఆగ్రహం

అంగారక గ్రహంలో దిగిన రష్యను మార్స్ (రెండు— మూడు) అక్కడ నుంచి టెలివిజను ద్వారా అక్కడ విషయాలు ప్రసారం చేస్తున్నాయట. అయితే యిటీవల అవి టెలివిజను ప్రసారం మానేశాయని వాటికి కారణం కనిపెట్టాల్సుందని రష్యా అన్నదట.

## వీరమాత!

రాజస్థాన్ సైన్యంలో రమేష్ అనే సైనికుడు యుద్ధంలో మరణిస్తే అతని కుటుంబానికి ప్రభుత్వం వేయి రూపాయలు యిచ్చారట. ఆ రమేష్ తల్లి ఆ డబ్బును నిరాకరిస్తూ, 'నా కొడుకు దేశంకోసం ప్రాణాలను త్యాగంచేశాడు. ఇంకా నా కొడుకులానే దేశంకోసం యుద్ధం చేస్తున్న సైనికులకోసం యీ డబ్బు వుపయోగించండి' అన్నదట.

* * *

బెంగళూరు కిర్లోస్కర్ ఫ్యాక్టరీలో పనిచేస్తున్న 45 ఏళ్ళ చక్కమ్మయ్య అనే అతను నిద్రపోతూ పక్కనున్న కిరోసిను లైటును తన్నాడట. దాంతో ఆ కిరసనాయిలు క్రింద ఒలికి ఉధృతంగా అంటుకుని, అతని పక్కకూడా అంటుకుని, అతని కాళ్ళు కొంచెం కాలిందట. పొగకు ఊపిరి ఆడక, అతను పక్కమీద చనిపోయాడట—అంత మొలకువ రాని నిద్రా!! ఛీఛీ!

* * *

ప్రముఖ స్వతంత్ర పార్టీ నాయకుడు పిరోజు షరాఫ్ నివసిస్తున్న కట్టడం అగ్నిప్రమాదానికి గురి అయి ఆయన మరణించారని వార్త. ●

# అతనూ బలంగా ఉండగలడు...
# తండ్రికి తగ్గ కొడుకు!




"పిల్లలను బలంగా ఆరోగ్యంగా ఉంచుటకు మరియు వారి సరియైన పాలన పోషణకు తల్లికి తెలివి తేటలు అవసరం" అన్న విజ్ఞతగల వాక్కులు గుర్తుంచుకోండి.

మరియొక గుర్తుంచుకోవలసిన విషయం—మీ పిల్లల ఆరోగ్యానికి గ్లాక్సో మిల్క్ ఫుడ్ ఎంత ప్రయోజనకారియో! దానిలో బలం కోసం విటమిన్‌లు, రక్తం కోసం ఇనుము, ఎముకల పుష్టికి కేల్షియం, మరియు దేహాభివృద్ధికి ప్రొటీన్లు మొదలైన అన్ని పుష్టికర పదార్థాలు సమకూర్చబడ్డాయి.

**ఏం, మీపాప కూడా గ్లాక్సో పాప యేనా?**

**గ్లాక్సో మిల్క్ ఫుడ్ పిల్లలకు బలం మరియు ఆరోగ్యం కలిగిస్తుంది**

*Creative Unit-682*

# నూతనతరహా ఆర్థికసంబంధాలు తెచ్చే భారత-సోవియట్ సంధి

రెండు దేశాలూ ప్రపంచ శాంతినీ అభ్యుదయాన్నీ కోరుతూన్నవీ, దేశాల మధ్య దోపిడి సంబంధాలు అంతరింప జేయాలని దృఢ నిర్ణయంతో వున్నవీ కావడంచేతనే సోవియట్—భారతదేశాల మధ్య చాల ఏళ్ళుగా మైత్రీ భావం వుంది దాని ఉజ్వల చరిత్రలో స్నేహ సంధి ఒక ముఖ్యమయిన మజిలీ. ఉభయులకూ లాభ కరంగా, ప్రపంచ శాంతిని పెంపొందించే టట్లు తమ స్నేహ బంధాల నింకా గట్టి పరుచుకోవాలనే ఆకాంక్షనది తెలుపు తూంది.

భారత ఉపఖండంలో శాంతి భారతదేశ ఆర్థికాభివృద్ధికి చాలా ముఖ్యం. ఆ విష యంగా స్నేహ సంధి కెంతో ప్రాముఖ్యం వుంది. ఎవరో దాడి చేస్తారనే బెరుకూ, ఆందోళనా లేకుండా భారతదేశం తన శక్తి యుక్తులను దేశాభివృద్ధికి వుపయోగించ గలదు. ఎవ్వరూ దురాక్రమణోద్దేశాలు పెట్టుకోకుండా యీ సంధి మంచి పూట కాపు.

భారత ఉప ఖండంలో ఆర్థిక అభి వృద్ధికి శాంతి అవసరమైనట్లే, ఉత్పత్తి శక్తుల సత్వరాభివృద్ధీ, సముచిత వుత్పత్తి సంబంధాల ఏర్పాటూ కూడ అవసరమై నవే. భారత ప్రజలూ, భారత రాజకీయ నాయకులూ సాధించవలసిన కార్యం యిది; అయితే మిత్రులు తమ అనుభవాలు చెప్ప గలుగుతారు. మార్గం చూపగలుగుతారు. ఈ మహా కార్య నిర్వహణలో సాయం చేయ గలగుతారు. సోషలిస్టు పునర్నిర్మాణ దశ సోవియట్ చరిత్రలోనే ఎంతో ఉత్కంఠా పూరితమయిన ఘట్టం. సామ్రాజ్యవాదుల పెత్తనంలో వుండడంచేత భారత నాయ కులకు సోషలిస్టు పునర్నిర్మాణం గురిం చిన సోవియట్ ఆలోచనలతోనూ, సోవియట్ అనుభవాలతోనూ ప్రత్యక్ష సంబంధం సాధ్యం కాకపోయింది. సోవియట్ పురోగతి చూసి భారత ప్రజ ఆశ్చర్యపడింది. ఆ సమాజానికి మెప్పు చూపింది. కాని, సాంస్కృతిక సంబంధాలు పెట్టుకొనేందుకు అవకాశాలు తక్కువ. సామ్రాజ్యవాద పాలన కాలంలో పశ్చిమదేశాలతో కలిగిన సాంస్కృ తిక సంబంధాలు దేశాన్ని ముందుకు తీసుకు పోవడానికి బదులు దిగతీశాయి. పశ్చిమ దేశాల నుంచి ప్రవేశపెట్టిన నూతన ఉత్పత్తి సాధనాలు విదేశీ పెట్టుబడులతో సంబంధంవున్న పెట్టుబడిదారీ పరిశ్రమలు అక్కడాఅక్కడా లంకలలా ఏర్పడడానికి సాయ పడింది. స్వతంత్ర భారతదేశం ఈ ధోరణిని మార్చదలచింది. శాస్త్రం, సాహిత్యం, విద్య మొదలైన రంగాలలో సోవియట్ భారతదేశాల మధ్య సంబంధాలూ, అను బంధాలూ పెంపొందించదలచిన స్నేహ సంధి 7 వ ఆర్టికల్, ఉత్పత్తి శక్తుల నభివృద్ధిపరచగల నేర్పు అలవరచుకోడానికీ దోపిడీచేయని ఉత్పత్తి సంబంధాలు నెల కొల్పేటట్లు నాయకులలో మంచి దృక్ప థాలు కలిగించడానికి తోడ్పడుతుంది.

పురోగమించిన దేశంనుంచి లభించే సహాయం తగిన పరిస్థితులుంటే, పెరుగు దలను త్వరిత పరుస్తుంది. అయితే అభివృద్ధిపొందిన పెట్టుబడిదారీ దేశాలిచ్చే సహాయం రాజకీయ కారణాలతో వుంటుంది. సైనికావసరాల కిస్తారు. ఎన్నో షరతు లుంటాయి. బడుగుదేశాలలో నిలకడగా అభివృద్ధి కలిగేందుకు అది అంతగా సాయ పడదు. రెండోవేపున భారతదేశంలో త్వరి తంగా పారిశ్రామిక అభివృద్ధి కలగడానికి పునాదులువేసే ఉక్కు, ఖనిజ తైలం, విద్యుత్తు, భారీ ఇంజనీరింగు వస్తువులు మొదలైన పరిశ్రమల అభివృద్ధికే సోవి యట్ సహాయం వినియోగ పడుతూంది. విదేశసంస్థల గుత్త అధికారాన్ని భగ్నపరచ



హామ్‌బెర్గ్‌లో నిర్వహించిన మానవుడు — సాగరుడు ప్రదర్శనలో సాగర గర్భంలో నిర్మింపబడే నగరం నమూనాని ప్రదర్శించారు.
-(యు. పి. ఎస్ — డాడ్)

దానికి అది ఉపయోగిస్తుంది. ఆర్థిక సహాకారం విషయమై సంధిలో పొందు పరచడంవలన భారతదేశానికి యింకా అధిక సహాయం లభిస్తుందనుకోవచ్చు.

అభివృద్ధి పొందని దేశాల ఆర్థిక పురోగతికి వాణిజ్యంకూడా చాలా ముఖ్యమే. అభివృద్ధి పొందిన దేశాలనుంచి బడుగు దేశాలు పొందిన కొద్దిపాటి సాయం ఆ దేశాలతో చేసే వర్తకంలో తుడుచుకు పోతుంది. అది అందరికీ తెలుసు. 'ఈ' దశలో అంతర్జాతీయ బజార్లలోకి సోవియట్ ప్రవేశం ఎంతో ప్రయోజనకరం అయింది. సోవియట్‌తో వాణిజ్యం దీర్ఘకాలిక సంబంధాలతో సాగుతుంది. కనక ఉత్పత్తికొక పథకం వేసుకోవచ్చు. దిగుమతి చేసుకొన్న దాని విలువను రూపాయలలో యివ్వవచ్చు. వాణిజ్యపు షరతులు ఎగుమతి దిగుమతులకు లోనుకాకుండా ఉభయులకూ లాభకరం అయ్యేటట్లు ముందుగానే నిర్ణయించు కొంటారు. 1960 దశాబ్దితో భారతదేశం నుంచి సోవియట్‌కు టీ, జీడిపప్పు, పొగాకు, గోగు నార, నూనె చెక్క, పత్తి, బట్టలు మొ॥ యిన వాని ఎగుమతి విపరీతంగా పెరిగింది. భారత దేశాభివృద్ధికి అత్యవసరమైన యంత్రములూ మొదలైన వానినే ప్రధానంగా సోవియట్‌నుంచి దిగుమతి చేసుకొన్నాము. సోవియట్‌తో వాణిజ్యం వలన అంతర్జాతీయ మార్కెట్ల ఉచ్ఛ పతనాల పీడనుంచి బయటపడతాము. వస్తువులను పథకం ప్రకారం ఉత్పత్తి చేసుకోగలుగుతాము. అందుచేత రెండు దేశాలమధ్య వాణిజ్య విస్తరణ నుద్దేశించిన 7 వ క్లాజుకు ఎంతో ప్రాధాన్యం వుంది.

ఇంకొక్క మాటతో ముగిస్తా. భారత దేశ ఆర్థికాభివృద్ధి భారతప్రజల కర్తవ్యం. భారత రాజకీయ నాయకుల బాధ్యత. దానికి శాంతి అత్యావశ్యకం. పురోగమించిన సోషలిస్టుదేశం చేసే సాయం ఉత్పత్తి సాధనాలు పెంపొందడానికి, దోపిడీలేని ఉత్పత్తి సంబంధాలు పెంపొందడానికి సాయపడుతుంది. ఈ విషయంగా ప్రస్తుత సంధి కెంతో ప్రాముఖ్యం వుంది.

—ప్రొఫెసర్ జి. పార్థసారథి.

# పెదకథ

(గత సంచిక తరువాయి)



వరండాలో నాగభూషణం కంఠం మంద్రస్వరంలో నిర్వికారంగా వినిపిస్తోంది.

'ఇదిగో సామ్రాజ్యం!' అయిపోయిన దానికి అల్లరెందుకు పెడతావు చెప్పు? తప్పెవరిది? 'పిల్లని ఎన్నాళ్ళు నీ దగ్గర పెట్టుకుంటావు పంపవే' అని చిలక్కి చెప్పినట్టు బతిమలాడీ, బామాడీ చెప్పానా నీకు? విన్నావా? నా పంతమే నాదని తలాయించావ్... అలాక్కాదని కరణం గారిచేత చెప్పించాను. అప్పటికైనా విన్నావా? పెడ చెవిన పెట్టావ్; అందర్నీ కాదని కొండ కొమ్మెక్కి కూర్చున్నావే...ఒక రోజా రెండు రోజులా ఏణ్ణార్ధం వోపికపట్టాను. ఇంకెంత కాలం ఎదురు చూడమంటావ్? నాలాగే వాడూ విదురుడయితే వంశ నిర్మూలన మయిపోతుందే,— ఏ లోకంలో వుందో న అక్క నన్ను క్షమించదే ... అన్న క్షోభ నన్నెంత పట్టిపల్లారిస్తే నేను వాడికి మళ్ళీ పెళ్ళి తలపెట్టానో నీకు తెలుసునా?

ఇప్పుడొచ్చి ఇది నీకు తగునా అని నన్ను నిలేస్తే నేనేం చెయ్యగలను? అయినా ముందునించీ నీ కోరికల్లా కూతుర్ని దగ్గరుంచుకోవాలనేగదా ... ఇక నిరాక్షేపణగా ఉంచుకో ... నిన్నింక ఎవ్వరూ నీ కూతుర్ని అత్తవారింటికి పంపవే అని బలవంతం చెయ్యరు.'



# గాలిలో దీపాలు

మంచు పైకి చల్లగానే ఉంటుంది కాని నిప్పువలె అది కూడా శరీరాన్ని కాల్చేస్తుంది. నాగభూషణం చల్లగా మెల్లగా యుక్తి యుక్తంగా విసిరిన వ్యంగ్యం చురుక్కున తాకింది కాబోలు సామ్రాజ్యానికి. ఆవిడ గొంతు తారస్థాయికి పెరిగింది.

'పుట్టింటి దగ్గర ఏణ్ణర్థం కాదు పదేళ్ళుంటుంది మావయ్యా. తప్పేముందో చెప్పు? ఒక్కగానొక్క బిడ్డ అవటంవల్ల మరి కొన్నాళ్ళు కళ్ళముందుంచుకోవాలని ముచ్చటపడిన మాట నిజమే. నాది మూర్ఖపట్టే ననుకో... కాని నాకు బుద్ధి చెప్పాలిసిందీ విధంగానేనా? మేనల్లుడి సంసారం వర్ధిల్లాలనే చూశావుగానీ, ఇటు నా కూతురు నీ కూతురివంటిది కదా— దాని కాపురం కూల్చేస్తున్నానని మనసులో



పరిపెట్టి నాగచంద్రావతి

నైనా తలిచావా ? చెప్పు! ఇప్పుడు దీన్నే గంగలో దిగమంటావో చెప్పు!' కడిగేస్తోంది స్వామ్రాజ్యం. బెల్లం కొట్టిన రాయిలా మాట్లాడలేదు నాగభూషణం.

ఇంకా వాళ్ల సంభాషణ ఏ ఏ ఘట్టాలు దాటేదో గాని, ఇంతలో పొలాన్నించి మావారు రావటంతో అంతటితో అంత మయింది.

ఆయనతో పాటుగా స్వామ్రాజ్యమ్మా, ఆవిడ కూతురూ కూడా లోనికి వచ్చారు. నేరం చేసినదానిలా నేను ముడుచుకుపోతూ గదిలోకి వెళ్ళిపోయాను.

సొంత ఇల్లన్నంత దిమాగా వంట ఇంట్లో ప్రవేశించి ఆయనకు భోజనం వడ్డించింది స్వామ్రాజ్యమ్మ. మళ్ళీ ఆయన పొలం వెళ్ళేవరకూ 'తమ్ముడూ తమ్ముడూ' అంటో, వెనకాలే తిరుగుతో, ఏదో చెబుతో గదిలోకి రానివ్వలేదు ఉపాయంగా.

రాత్రి తనే మడి కట్టుకుంది. వడ్డనా తనే చేసింది. భోజనాల దగ్గర మళ్ళీ వాదన లేచింది; నాకు మరికొన్ని అంశాలు బోధపడ్డాయి; వాటితో నా వూహల్ని జోడించి నేను చాలావరకూ గ్రహించ గలిగాను.

స్వామ్రాజ్యం మా వారి పినతల్లి కూతు రట. మా వూరికి పక్కనే ఉన్న మరో పల్లెటూరిలోనే వారి నివాసం. సీత ఒక్కతే ఆమెకు సంతానం. మేనల్లుడి ఆస్తి రెట్టింపవుతు పెరుగుతుందనే అత్యాశకొద్దీ మేనరికం ఇష్టపడే చేశారు నాగభూషణం.

ఆ తరవాతే వచ్చింది మతలబు. స్వామ్రాజ్యమూ, ఆమె పెనిమిటీ, కూతుర్ని విడిచి వుండలేక, తమ్ముడిల్లే కదా అని కూతురితోపాటు వారూ ఇక్కడకు చేరు కున్నారు. వచ్చినవాళ్లు వచ్చినట్టుంటే ఇన్ని అనర్థాలు వాటిల్లకపోను.

నాగభూషణం తమ అల్లుడి ఇంటిని ఏకఛత్రాధిపత్యంగా ఏలటం కంటగింపయింది స్వామ్రాజ్యమ్మ దంపతులకి అక్క కొడుకనే అభిమానంతో ఆదుకొని, చిన్న ప్పటినించీ పెంచి, పెద్దచేసి, ప్రాజ్ఞుడిని చేసిన మాట నిజమే కావచ్చును. కాని ఇన్నేళ్ళూ ఈ ఐశ్వర్యాన్ని ఎదురులేకుండా అనుభవించాడు కదా. ఇంకా ఆ పదవినే అంటిపెట్టుకునుండాలనుకోడం దురాశే అని భావించారు వాళ్ళిద్దరూ. స్వయంగా

# గాలిలో దీపాలు

ఇక తమకు సంక్రమించాలిసిన ఆధిపత్యాన్ని ఆయనింకా ఒదులుకోకపోవటం అక్రమ మనుకున్నారు; ఎలాగయినా ఆ అధికారాన్ని తమ హస్తగతం చేసుకోవాలని తలచారు.

దానితో నాగభూషణానికి తొందర కలి గింది. ఉపేక్షిస్తే తన పీఠానికి ముప్పు తప్ప దని గ్రహించాడు. ఇన్నాళ్ళ తన స్వయం జావుటా ఎగిరిన ఆ వూళ్ళోనూ, ఆ ఇంట్లోనూ ప్రతి కక్షలేర్పడడం తన ప్రతిభకే నవాలనుకున్నాడు. 'మేనగోడలు గదా' అని దయతలిస్తే లాభం లేదనీ, వాళ్ళని ఇక్కణ్ణించి ఉద్వాసన పలకాలనీ నిర్ణయించుకున్నాడు.

మేనల్లుడు ఇంకా తన పరిధిలోనే మెలుగుతున్నాడు గాబట్టి, స్వామ్రాజ్యమ్మ దంపతుల ఆటకట్టించాడు. తన శక్తి యుక్తులన్నీ ప్రయోగించి వాళ్ళు ఇక్క ణ్ణించి కదిలేవరకూ పూదరగొట్టి తరిమే శాడు.

అవజయంలో, అవమానంతో తమ ఇంటికి జేరుకున్న స్వామ్రాజ్యం దంపతులు నాగభూషణం కోరలూడ బెరకటానికి మార్గాలన్వేషించారు.

స్వతహాగా తమ అల్లుడు ఒహమెతక. నోట్లో నాలిక లేనివాడు. అతన్నట్లా తయారుచేసి తన గుప్పిట్లో యిరికించు కున్నాడు నాగభూషణం. తనదంటూ గుడ్డి గవ్వ లేకపోయినా అష్టైశ్వర్యాలు అనుభ విస్తున్నాడు. అతని ఆట కట్టించాలంటే అల్లుణ్ణి తమవైపుకు మళ్లించుకోవాలి. కూతురిద్వారా అల్లుణ్ణి లోబరచుకోవడం తేలిక.

పండగవంకన కూతురు సీతని తమ ఇంటికి రప్పించుకున్నారు. సీతకోసం అల్లుడు తమ ఇంటికి వస్తాడని, ఆ సమ యంలో అతన్ని మంచి మాటలతో తమ వైపు తిప్పుకోవాలనీ వారి పథకం.

కాని నాగభూషణం వారి ఎత్తు సాగ నిచ్చాడు కాదు. మేనల్లుణ్ణి అటుపేసి తొంగిచూడనివ్వలేదు. వాళ్లతోనూ, పీళ్ళ తోనూ కబుర్లు పెట్టాడు 'పిల్లని పంపించూ' అని.

ఆ కబురులో 'నాతో నువ్వు పోటీ పడ్డం పొట్టేలుతో మేకపిల్ల ఢీ కొనడం వంటిది సుమా! ఇప్పటికైనా బుద్ధి తెచ్చుకో' అన్న హెచ్చరిక వినిపించింది స్వామ్రాజ్యానికి. మరీ బిర్రబిగిసి సీతని తన దగ్గరే ఉంచేసుకుంది; 'ఏం జేస్తావో చేసుకో' అన్నట్టు. నెలలు గడిచాయి. ఎవరి పంతాలూ సడలలేదు.

స్వామ్రాజ్యమ్మ కొత్త ఉపాయంవన్నింది. పొలంలో కుప్పదగ్గర కావలాగా పడుకుం టున్న అల్లుణ్ణి మేనమామకి తెలియకుండా రహస్యంగా తమ ఇంటికి రప్పించుకోవటం ప్రారంభించింది.

అవురిస్తే పేలు లెఖ్కపెట్టే నాగ భూషణం దృష్టిలో ఈ చాటుమాటు వ్యవహారం పడనేపడింది. మేనల్లుడు తన చెయిజారి పోతున్నందుకు గాభరాపడ్డాడు. తను గీసిన గిరి దాట సాహసించని అల్లా గాడు తన చాటున అంతకు తెగించాడంటే వయసులోవున్న అతనికి స్త్రీ సాంగత్యం ఎంత ముఖ్యమో కూడా బోధపడిందాయనకి.

స్వామ్రాజ్యం అహం అణచటానికీ, మేనల్లుడి అవసరం తీర్చడానికీ ఒకే పరి ష్కారాన్ని ఎన్నుకున్నారు నాగభూషణం. దాని ఫలితంగానే నా వివాహం జరిగింది. మేనల్లుడు నంగినంగిగా అడ్డు చెప్పినా విని పించుకోలేదట. మూడో కంటికి తెలియ కుండా మా సమ్మంధం కుదుర్చుకొన్నాడు. బంధువు లెవ్వరికీ తెలియనివ్వలేదు తనకు పక్కతాళం వేసే ఒకరిద్దరిని మాత్రమే వెంటపెట్టుకొని వచ్చి పెళ్లితంతు ముగిం చాడు.

పల్లెటూళ్లలో రహస్యాలు దాగవు, పొద రసంలా క్షణాల్లో పాకిపోతాయి. ఈ వార్త స్వామ్రాజ్యమ్మ దంపతులకు శరాఘాతంలా తగిలింది. గుండెల్లో గుబులు బయలు దేరింది స్వామ్రాజ్యమ్మకి.

'ఎంతయినా నాకూ మేనమామే కద... ఎప్పటికయినా దారికి రాకపోతాడా' అని అనుకున్నది గానీ ఇంత ఘోరానికి తల పెడతాడనుకోలేదావిడ.

ఇటు తల్లి తండ్రి అటు నాగభూ షణం తన జీవితాన్ని పరిచి ఆడుతోన్న చదరంగాన్ని చూస్తూ లోలోపలే ఆందోళన పడుతోన్న సీత, 'నా సంసారాన్ని చేతులారా పిరే కాలదోశారని' మొట్ట మొదటి సారిగా నోరు విప్పి కుప్పకూలిపోయింది.

'దావా పడేస్తాను. అ పెళ్లిలాగి చెల్లు

ఉందో చూస్తాను.' అని కారాలూ మిరియాలూ నూరాడు స్వామాజ్యమ్మ భర్త.

స్వామాజ్యమ్మ ముందు చూపుతో ఆలోచించింది 'నిజమే. కోర్టు కెక్కితే ఆ పెళ్ళి నిలవదు. కాని ఆ తరవాత తనని కోర్టు కీడ్పించారన్న కక్షకొద్దీ తాచు పాములాంటి నాగభూషణం తన కూతురి కాపురానికి కాటు వెయ్యక మానుతాడా? ఉహూ...ఇది మంచి సద్దలి కాదు. సీత సంసారం కుదుటపడాలంటే, 'శరణం మమ' అని ఆయన కాళ్ళు పట్టుకోవటమే ఉత్తమం' అనుకున్నదానిడ తరుణం మించాక కళ్ళు తెరుస్తూ.

వడుతో లేస్తూ కూతురితోసహా వచ్చి వడిందందుకనే.

తప్పు తమదైనా దోషం మరొకరికి ఆపాదించడం ధూర్తత్వ లక్షణం. చెతులు కాలాక అకులు పట్టుకున్న చందంగా, తన మూర్ఖప్పట్టు కారణంగా కూతురి సంసారాన్ని ఇరకాటంలో పడేసిందికాక మరో అభం శుభం తెలియని ఆడపిల్ల జీవితానికి చిచ్చు పెట్టానన్న విచారం స్వామాజ్యమ్మకు లేకపోగా, దీనికి పూర్తి కారణ భూతురాలిని నేనే నన్నట్టు నన్ను చూసీ చూడగానే గ్రహాన్నంటో కూరాకులో పురుగును చూసినట్టు చీదరించుకున్నది.

ఆ రాత్రి నన్ను భోజనం చెయ్యమని అడిగినవారులేరు. నాకు ఆకలి కాలేదు. అలాగే ఆ గదిలో ఒక మూల ఒదిగి కూర్చున్నాను పరాయిదానిలా.

చాలా రాత్రివరకూ ముందు చావిట్లో నాగభూషణమూ, స్వామాజ్యమూ మెల్లగా గుసగుసలాడుతూనే ఉన్నారు.

ఒక రాత్రివేళ, మావారు నేనున్న గది లోకివచ్చారు. ఆయన గుండెలమీద వాలి ఏమిటీ అన్యాయమని ఏడ్చాను. కరిగి పోయారాయన. 'ఈ కుతంత్రమంతా మేన మామదే అనీ, ముందునించీ ఆయన ఒద్దికలో మెలగడంబట్టి ఆయనేంచేసినా ఎదురు తిరగలేకపోతున్నాననీ నాపోయారాయన.

ఆయన మాటల్లో నాకే రక్షణా దొరక లేదు; ఏ వూరటా కలగలేదు; ముందేం జరగబోయ్యేదీ కూడా ఆ మేనమామ చిత్తంమీదే ఆధారపడివుంటుందని అర్థ మయిపోయింది నాకు.

మధ్యాహ్నంనించీ అలజడితో, అశాం

# గాలిలో దీపాలు

తితో అతలాకుతలమయిపోతున్న మనస్సు విశ్రాంతి కోరింది; ఒళ్ళు తెలియకుండా నిద్రపట్టింది. ఎంతసేపు అలా నిద్ర పోయానో తెలియదుగానీ, నా భుజంపట్టి కుదుపుతూ స్వామాజ్యమ్మ నన్ను లేపింది. ఆలుమగలు ఏకాంతంగావున్న గదిలోకి అంత చొరవగా ఎలా రాగలిగిందో నా కర్థంకాలేదు; నిద్రమత్తులో ఉన్న నన్ను, 'ఇవతలికి రమ్మ'ని ఆజ్ఞాపించింది

అయోమయంగా బయటకు వచ్చాను. పాల గ్లాసు చేత్తోపట్టుకుని లోపలికి వెళ్ళి తలుపు బిగించుకున్నది స్వామాజ్యమ్మ కూతురు సీత.

ఒక్కసారిగా నిద్రమత్తంతా ఒదిలి పోయి నిర్ఘాంతపోతూ నిలబడిపోయాను. నావైపు నిర్లక్ష్యంగా చూస్తూ ముందు చావిట్లోకి వెళ్ళిపోయింది స్వామాజ్యం. మిగతా రాత్రంతా నాలో నేనే కుమిలి పోతూ జాగారం చేశాను.

తెల్లవారింది నాగభూషణంతో ఎలా రాజీ కొచ్చిందో తెలియదు; ఇల్లంతా తానే అయి వ్యవహరిస్తోంది స్వామాజ్యమ్మ.

నాగభూషణం చెప్పినదానికి అవుననంటూ స్వామాజ్యమ్మూ, స్వామాజ్యమ్మ అన్నదానికి 'కాదూమరి' అంటూ నాగ భూషణమూ ఒకరికొకరు వంతపాట పాడు తున్నారు.

బహుశా నాగభూషణం అధికారానికి తలఒగ్గి, దాసోహమని, తన కూతురి సంసారానికి అభయమిమ్మని స్వామాజ్యమ్మ అర్థించి వుంటుందని ఊహించాను.

ఆయన అహంకారానికి విజయం లభించాక, మేనకోడలిమీద తన కటాక్ష వీక్షణాలు బరిపించటం సహజంగానే జరిగి పోయి వుంటుంది.

కాగా ఇప్పుడు ఒకరినొకరు మంచి చేసుకోవటం అవసరంకూడానూ. తనుచేసిన తప్పుడు పనిని రచ్చ కీడ్వకుండా నాగభూషణమూ, ఏదోవిధాన కుమార్తె సంసారం నిలబెట్టడం కోసం స్వామాజ్యమ్మా తోడు దొంగలు కావటంలో వింతేమీలేదు.

'అబోతుల పోరాటంలో మధ్య నలిగిన లేగదూడ'లా మిగిలాను నేను.

నాగభూషణం నన్ను చేరబిలిచి నన్ను అట్టే బాధ పడవద్దని, స్వామాజ్యమ్మ నన్ను ఒక కూతుర్లాగే చూసుకుంటుం దనీ, నేను సీతను తోబుట్టువులా మన్నిం చాలనీ...ఇంకా ఇలాంటివే నాలుగు వోదార్పు మాటలు చెప్పాడు.

ఏమనగలను! కలితో ఉన్నవాడిముందు అరిటాకువరిచి, పిండివంటలు వడ్డించి, తీరా కబళమెత్తబోయేవేళకు, 'ఏకు కాదిది' అని హెచ్చరించి, 'విచారించనద్దని' వోదారిస్తే గుక్కిళ్ళు మింగటం మినహా ఏమనగలరు ఎవరైనా?

దుఃఖం గొంతుక్కడ్డం పడుతోంటే ఆయనకేమీ బదులు చెప్పలేక పోయాను. ముందునించీ నాకు వోర్పుతోపాటు కర్మ సిద్ధాంతాన్నికూడా నూరిపోసేది మా అమ్మ. ఈ కష్టకాలంలో నాకా సిద్ధాంతమే అక్కర కొచ్చింది. ఇదంతా నా ఖర్మ; నేచేసుకున్న ప్రారబ్ధం అనుకుంటూ నన్ను నేనే సముదాయించుకొనేదాన్ని.

ఆవేళటినుంచీ ఇంట్లో పెత్తనం సీతదయింది నేనన్న మనిషిని ఉన్నట్లే ప్రవర్తించేది కాదు. అందరూ తినగా గిన్నె అడుగున మిగిలిన పిడికెడు మెతుకులే నాకు గతి అయ్యేవి. అందుకు విచారపడను నేను. కానీ ఒక్కనాడూ నాభర్తని నాకళ్ళ పడనిచ్చేది కాదు సీత. చెదురుమదురుగా ఎదురైనా నా బెదురుగా తల తిప్పుకుని వెళ్ళిపోయే వారాయన.

వూళ్ళోవారి సానుభూతి కూడా సీతకే దక్కింది. ఇంటికొచ్చిన ప్రతి ఒక్కరూ, యిరుగుపొరుగులు సయితం 'ఏం సీతా ఒచ్చేశావుకద... పండంటి సంసారాన్ని కాల దన్నుకుంటున్నావే అని ఇన్నాళ్ళూ తెగ బాధ పడేవాళ్ళం సుమా' అనేవాళ్ళు.

నేను వారిదృష్టిలో ఈ ఇంటి కోడలిని కాదు సరికదా ఆస్తి కాజేయటానికి వచ్చిన ఒకానొక నెరజాణని; దుర్మార్గురాలిని.

ప్రతి క్షణం ఈ నరకంనుండి పారిపోనా లనీ, అమ్మ గుండెల్లో దూరి కరువుతీరా ఏడవాలని అనిపించేది

కాని నేను సుఖపడుతున్నాననే భ్రమలో నిశ్చింతగా వున్న అమ్మ గుండెల్లో ఆరని చిచ్చు నా అంతట నేనే రగిలించలేక పోయాను.

రోజులు గడుస్తున్నాయి స్వామాజ్యమ్మ

వస్తూ పోతూ వుండేది. నా దుస్థితిలో ఏమాత్రం మార్పు లేదు

ఒకసారి సాహసంచేసి సీత ఏమరుపాటుగా వున్న సమయంలో మా వారి గదిలో ప్రవేశించి గడియ వేశాను

ఇన్నాళ్లబట్టి నాలో పెరుకుపోతున్న వ్యథ గుమ్మరించాను వారి ముందు.

'ఏ పాప మెరుగని నా కెందుకీ శిక్ష ?' అని మొత్తుకున్నాను; 'జరిగిపోయిన సంగతుల్ని నేనూ తరిచి అడగను నన్నూ సీతతోపాటుగా చూసుకోమని' మొరపెట్టుకున్నాను. వారి ఆసరా నాకుంటే ఎంతటి కష్టాన్నయినా భరించగలనని బతిమలాడుకున్నాను

నా వంక అశక్తతగా చూశారాయన. 'సీత అన్ని విషయాలలోనూ మంచిదే నీ పేరెత్తితే మాత్రం కొంగ కొర లాడుతుంది గట్టిగా చెప్పబోతే ఏడుపు మొదలెడుతుంది. నేనేం చెయ్యను చెప్పు' అన్నారు.

నా మీద దయ చూపించాలనంటే, అందుకు సీత అనుజ్ఞ కావాలన్న మాట. ఎంత దౌర్భాగ్యురాలిని నేను!

నిజమే. సీత వారికి రెండు భార్య. వారి ప్రేమానురాగానికి అసలైన హక్కుదారిణి.

ఇక నేనో! మెడలో తాళివున్నా దానికో విలువ లేనిదానిని; ఆ ఇంట జీతం తీసుకుని పనిచేసే సేవకులకుండే స్థానమన్నా లేనిదాన్ని, కనీసం తళుకు బెళుకులతో నయగారపు పలుకులతో వారిని ఆకర్షించుకుని వశపరుచుకునేందుకు తగిన అంద చందాలయినా ప్రసాదించాడు కాదా భగవంతుడు

కళ్లనిండా కూడుకున్న నా కన్నీరు బయటకు పొర్లనేలేదు. గది తలుపు దబ దబ బాదేస్తోంది సీత. తలుపు తెరిచాను; నన్ను కాల్చేసేలా చూసింది సీత

సామ్రాజ్యమ్మ నా రెక్క పట్టుకుని బయటకు నడిపిస్తూ, 'ఉత్త పిల్ల కూడా కాదు దాని మనసు కష్టపెట్టబోకమ్మా' అంటోంది

త్వరలో తల్లి కాబోతున్న సీత ఆ ఇంటి సర్వాధికారిణిగా స్థిరపడుతోంది ఇక ఆ గదిలోనే కాదు, ఈ ఇంట్లోనే నాకు స్థానం లేదు.

పైగా—

నా దీన స్థితిని అలుసు చూసుకుని పాలేరు కొండయ్య నా వంక ఎదో రకంగా చూడ్డం ప్రారంభించాడు

పొంచెంబు అందిస్తూ వేళ్లు తాకించడం, సామాన్లు గదిలో గోనె సంచుల కట్ట తిసుకువెడుతూ, అక్కడే వంటరిగా పడుకున్న నన్ను చూసి, 'ఏందమ్మా ఈడ పడుకున్నావ్' అంటో వెకిలిగా నవ్వటం, అవసరం లేకపోయినా కలిపించుకుని ఏదో ఒకటి నాతో వాగటం మొదలుపెట్టాడు.

వాడి తెంపరితనానికే నేనో పక్క హడలిపోతూంటే, 'నాడితో నీకు మాట లేవిటీ?' అని దీర్ఘంతీస్తో అనుమానంగా చూస్తోంది సీత.

సీత ఏమి చెప్పిందో ఏమిటో, 'చూడమ్మాయ్! మాది పరువుగల కుటుంబం. నువ్వు విచ్చలవిడిగా పాలేర్లతో రాసుకునీ, పూసుకోవటం ఎవరైనా చూస్తే తల ఎత్తుకు తిరగలేం జాగ్రత్తగా మసులుకో' అంటూ హితబోధ చేశాడోనాడు నాగభూషణం.

సిరిసంపదలు పొంగులాడే ఆ ఇల్లు నా కళ్లకొక దారీడొంకా లేని కీకారణ్యంలాగా, ఆ కొంపలోని మనుషులంతా నన్ను కబళించడానికి పొంచి చూస్తున్న క్రూరమృగాల్లాగా అనిపించి గజగజలాడిపోయాను.

నా ఓరిమి అడుగంటిపోయింది. ఆ ఇంట దినదిన గండంగా మనుగడ సాగించడం దుర్భరమనిపించింది. అమ్మకు ఉత్తరం రాశాను. మూడోనాటికల్లా రెక్కలు కట్టుకు వాలింది

కలలోనైనా ఊహించని నా దౌర్భాగ్యానికి గుండెలవిసేలా విలపించింది.

శాంతస్వభావురాలైన మా అమ్మ ఉగ్రకాళై నాగభూషణాన్ని తూర్పారబట్టింది.

ఎదుటివాళ్ళు హెచ్చితే తను తగ్గటం, వాళ్ళు తగ్గినప్పుడు తాను పెచ్చురేగటం నాగభూషణం లౌక్యానికి నిదర్శనం.

ఆయన మెత్తమెత్తని సమాధానాలు విని అగ్నిహోత్రంమీద నీళ్ళు చిలకరించినట్టు చల్లబడింది అమ్మ.

'తను మాకు చేసిన వంచన ఏమాత్రం లేదన్నాడు; రెండోపెళ్ళని ముందే చెప్పానన్నాడు; ముందు భార్యలేదని తన నోటితో చెప్పలేదన్నాడు; అల్లరి చేసుకోడంవల్ల ప్రయోజనమేమీలేదనీ, అది మాకే ముప్పనీ అన్నాడు; ఏ న్యాయస్థానమైనా సీతపక్షానే నిలబడుతుందిగానీ, నా తరఫున కదని గ్రహించమన్నాడ; ఇప్పటికైనా మించిపోయిందేమీలేదని, తన మేనల్లుడు ఇద్దర్ని




"బెంగాలీ ముసిములు వాళ్ళ కంటికి కనపించరు కాబోలు…"

కాదు ముగ్గురినయినా పోషించే స్తోమతు గలవాడేననీ' అన్నాడు నాగభూషణం.

చేదుగానేఉన్నా ఆయన చెప్పిన మాట లన్నీ నిజాలేనని ఒప్పుకోక తప్పదు. నాలుగు రోజుల్లోనే నేను నోరు విప్పి చెప్పకుండానే ఆ ఇంట్లో నేను అనుభవించే వైభోగం అవగాహన అయింది అమ్మకి.

చివరిసారిగా నాగభూషణానికి చెయ్యెత్తి దణ్ణంపెట్టి నన్ను తీసుకు వచ్చేసింది అమ్మ. ఆ నమస్కారం నాగభూషణానికో ఆయన దుష్టత్వానికో తెలియలేదు నాకు.

* *

చెప్పడం ముగించి నిట్టూర్చింది వరలక్ష్మి. నా మనసంతా వికలమయిపోయింది. కనుకొలుకుల్లో నీళ్లు నిలిచాయి.

'ఇంత చిన్న వయస్సులోనే ఎన్ని అగచాట్లు పడ్డావ్ వరలక్ష్మీ' అన్నాను సానుభూతితో.

అప్పుడే వంటయింటిలోంచి ఇవతలకు వచ్చి మాదగ్గరగా కూర్చుంటూ అన్నది తాయారమ్మ.

'అవునమ్మా తోడేళ్లమధ్య కుందేలు కూనలా నాబిడ్డ అక్కడ ఎన్నికడగండ్ల పాలయిందో, చెప్పకునేందుకు నా అన్న వాళ్లులేక ఎంత అల్లాడిపోయిందో తలుచుకుంటేనే నా గుండె నీరవుతూంటుంది' ఆవిడ మాటలు కన్నతల్లి మమకారం రంగరించి పోసినట్లున్నాయి.

హఠాత్తుగా గుర్తువచ్చింది నాకు. 'అవునూ ... సోమావధాన్లుగారూ మీరూ ముందునించీ ఎంతో పొత్తుగా, కలిసి కట్టుగా ఉండేవారు కదా...మరి ఈ అకాల వైరానిక్కారణ మేమిటీ? ఆయన భార్యే స్వయంగా మీమీద అవాకులూ, చెవాకులూ పేలుతున్నదటగదా? ఎందుకు వాళ్లకంత కక్ష?' మిగిలిపోయిన నా సందేహాన్ని బయటపెట్టాను కుతూహలంగా.

'కక్షకాదు తల్లీ! చేసిన ద్రోహాన్ని కప్పిపుచ్చుకునేందుకు వేసిన ఎత్తు! మా కిక్కడ నిలువ నీడలేకుండా చేసి తాను బాగుపడాలని చేస్తున్న ఎక్కజిత్తులివి' తాయారమ్మ మొహం కందగడ్డయిపోయింది. కళ్లల్లో ఎర్రటి జీరలు పాకాయి.

తిరిగీ ఆవిడకావిడే సంభాళించుకుని నిట్టూరుస్తూ మళ్లీ అన్నది 'అయినా మా దురదృష్టానికి ఒకర్నని ఏం లాభం

# గాలిలో దీపాలు

తల్లీ! రాతలో రాళ్లు మొయ్యమని వుంటే, రాజ్యాలు ఏలటం ఎలా సాధ్యమవుతుంది?' అన్నదావిడ విరక్తిగా.

మూలం అంతుపట్టలేదు నాకు. అదే అడిగాను మళ్లీ.

'ఏం చెప్పేదమ్మా! మనుషుల్లో ఇంత స్వార్థం బుసలుకొడుతూ ఉంటుందనుకోలేదు. పేనుకు పెత్తనమిచ్చినట్లు ఆ సోమావధాన్లుని నమ్మి సమ్మంధం విషయం విచారించి రమ్మని పంపినందుకు మాకు తగిన ప్రాయశ్చిత్తం చేశాడు.

నాగభూషణం దౌర్జన్యానికి దడిచి బయటకెవరూ చెప్పకపోయినా, ఆవూరి మునసబు, ఈయన్ని చాటుగాపిలిచి, అసలు సంగతంతా చెప్పి 'వాళ్లూ వాళ్లూ అయిన వాళ్లు..బంధువులు ఇవ్వాళ మాటమాట అనుకుని దూరమయినా రేపు కలుస్తారు. చూస్తూ చూస్తూ నూరేళ్లపంట కావాలిసిన నో ఆడపిల్ల బతుకుని ముళ్ల డొంకల్లోకి లాగుతూంటే ఊరుకోలేక ఈ సాహసంచేశాను. ఏదో సాకుతో ఈ సమ్మంధం తప్పించండి మీరు' అని చెప్పాడట వరాన్ని తీసుకొచ్చేస్తూండగా ఆ మునసబే నాకూ కనబడి ఈ విషయంచెప్పి తెగ విచారించాడు.

ముక్కూ మొహం తెలియని వో పరాయి మనిషికున్న సద్భావంకూడా ఈ సోమావధాన్లకి లేకపోయింది.

ఆ నాగభూషణం ఏం ఎరచూపించాడో నిజాన్ని తొక్కిపట్టి మాకళ్లు కప్పాడు. ఇహనిప్పుడు తన బండారం నేను బయట పడేస్తానని ఈకొత్త ఎత్తు ఎత్తాడు. దీనికి వెనకాల నాగభూషణం మద్దతు గూడా ఉన్నట్టుంది.

అదిన్నీగాక అదిగో ఇదిగో అనటమే కాని ఈ కొంపలకింకా పట్టాలు పుట్టనే లేదు. మమ్మల్నిలా నగుబాట్లు పాల్జేసి, మేమీవాదు, భరించలేక ఇక్కణ్ణించి తప్పుకుంటే ఈ కాస్త జాగకూడా తన స్థలంలో కలుపుకోవచ్చనే దుర్బుద్ధితో ఇంత అగడం చేస్తున్నాడు. 'ఇదిగో పులంటే, అదిగో తోక' అని కళ్లు మూసుకుని తందానా అనే ఈ లోకంలో ఎదురులేకుండా పారింది అతని కుతంత్రం.'

తాయారమ్మ నిర్లిప్తంగా చెప్పాలని, ఆవేశాన్ని అదుపులో పెట్టాలనీ చేసిన వృథా ప్రయత్నం నాకు అడుగడుగునా అవగతమవుతూనేవుంది.

అన్యాయమూ, అబద్ధమూ ఎరుగని నిర్మల హృదయుల్నీ, అమాయకుల్నీ మూడో కంటికి తెలియకుండా యాతన పెట్టగల సమర్థులూ, స్వప్రయోజనాలకోసం అతి నికృష్టంగా దిగజారిపోయే స్వార్థపరులూ ఈ లోకంలో అడుగడుగునా వుంటారని అనుభవమయింది నాకు.

సర్వమూ కోల్పోయినవారికి ఉపశాంతి వాక్యాలేం పలకను? మూగగా కూర్చుండి పోయాను.

సంధ్యాకాంత సౌభాగ్యాన్ని తుడిచివేస్తూ దినకరుడు కొండలమాటున కనుమరుగయ్యాడు. వాకిట్లో వ్యాపిస్తున్న క్రీనీడల్ని చూస్తూ, తాయారమ్మ విషాదంగా అంటోంది.

'మేమూ ఇక్కణ్ణించి వెళ్లిపోవాలనుకుంటున్నామమ్మా' అని.

ఉలిక్కిపడ్డాను. 'ఎక్కడికి వెడతారు తాయారమ్మగారూ మిమ్మల్నాదుకునేవారెవరున్నారు?' తెలియకుండానే నా కంఠం ఒణికింది.

విరాగిలా నవ్వింది తాయారమ్మ 'తెగిన గాలిపటాల్లాంటి వాళ్లం...గాలిలో దీపాల వంటి వాళ్లం... గాలి ఎటునెట్టితే అటు ఎగిరి, ఏగాలి విసురుకో కొండెక్కిపోతాము. మాలాంటి దీనులకి ఆ సర్వేశ్వరుడొక్కడే దిక్కమ్మా! కడుపు తడుముకుంటూ వచ్చాము. ఒకనాడు నాలుగు వేళ్లూ నోట్లోకి వెళ్లినాయి ఇవ్వాళ శూన్యం. విధి వక్రించింది. పరువుకోసం దేవుళ్లాడే మాకు అదే కరువయింది. తిండికీ ఇబ్బందవుతోంది మరిక్కడ ఏం చూసుకుని నిలవాలి తల్లీ''

అమావాస్య చీకట్లు అలుముకుంటున్నాయి. శూన్యమయిపోయిన వరలక్ష్మి భవిష్యత్తులా ఆ అంధకారం భయంకరంగా వున్నది.

లాంతరు వెలిగించి నమస్కరిస్తోంది వరలక్ష్మి.

మెరుపు మెరిసి మాయమయినట్టుగా కళ్లముందే భావిజీవితం మంటగలిసి. పోయినా ఇంకా భగవంతుడిమీద విశ్వాసం

# వాళ్లు - వీళ్లు

విన్నారా—యీ కథను
చూచారా యీ చోద్యం
కెమెరాల కొక క్లబ్బట!
ఫోటోల కొక పోటీల పందెమట
గెలిస్తే బహుమానమట!
ఓడితే ఒక కర చాలనమట!
గెలుపు—ఓటమి కాదు ప్రధానం
పోటీలో పాల్గొనుటే అందరూ సమానం
ఫోటోలు తీయడం ఒక అలవాటు
పోటీలు నడపడం ఒక వినోదం.
వేసారి క్లబ్బు సభ్యులు
ఒక వినోద ఫోటోల యాత్ర
నీలిరంగు సముద్రపు టొడ్డుకు
చూచారక్కడ బెస్తవాళ్ళు వీళ్లను
అనుకొన్నారిలా—
ఎవరీ పిచ్చివాళ్లు?
ఎందుకీ వింత ప్రయాణం?
నగరంలో పనిలేని వాళ్లా?
విరగం ఎందుకో సరదా యీ నీళ్లల్లో
ఫోటోలు తీస్తే పొట్ట గడుస్తుందా?
తిని కూర్చోలేక ఏమిటీ తిప్పలు?
తిన్నది అరగడానికి తిరగాలేమో!
మరిలేకుంటే ఏమిటీపాట్లు?
ఎగిరే పిట్టలను
మేసే పశువులను
పాడే పడతులను
పనిచేసే పల్లెవాళ్లను
చేపలు పట్టే గోచిరాయళ్లను
వీళ్లనా! వీళ్లు తీసేది ఫోటోలు?!
భలే! ఎంచక్కని పిచ్చివాళ్లు!!
వాళ్లలా అనుకోవడం న్యాయమే—
వీళ్లకు తీరిక సమయాల్లో ఏమి
చేయాలో తోచదు.
వాళ్లకు తీరికంటే ఏమో తెలియదు!
వీళ్లకు వాళ్లంటే అదొకరోత
వాళ్లకు వీళ్లంటే అదొక వింత
వీళ్లకు మురికి కాలవలే సెలయేళ్లు
వాళ్లకు సెలయేళ్లే మురికి కాలువలు!
వీళ్లు కేమెరా లెన్సు ఎత్తారు
వాళ్లు నావ తెరచాప ఎత్తారు
వీళ్లు నదిలో నీళ్లను ఆనందిస్తారు
వాళ్లు అందున్న చేపలను అందు
కుంటారు.
వీళ్లు తీస్తారు ప్రాణంలేని బొమ్మలను!
వాళ్లు తీస్తారు ప్రాణాలు బొమ్మడాల
చేపలకు
వీళ్లకు తీరేది క్రీడాతృష్ణ
వాళ్లకు తీరేది ఆకలిమంట!
వాళ్లు యిలా భావిస్తుంటే—
వీళ్ల కేమెరాలు—
తీస్తున్నాయి ఫోటోలు
రక రకాల జీవితాలనమూనాలు
కేమెరాకు వాళ్లు వీళ్లు ఏమిటి?
అంతా క్లబ్బు వాళ్ల వినోదంకొఱకే
కేమెరాలకు మాత్రం చచ్చేపంతపని—
ఇదంతా కలసి సాగేదే ఫోటోల వినోద
యాత్ర.

[కాకినాడ కేమెరా క్లబ్బువారు సేక్రెమెంటో లైట్‌హౌస్‌కు ఫోటోల వినోద యాత్ర (ఫోటోగ్రాఫిక్ సఫారీ) వెళ్లిన సందర్భంలో వ్రాసినది.]

—ఎల్. మాలకొండయ్య



'కొంగ'. ఆంధ్రప్రదేశ్ ఫెడరేషన్ ఆఫ్ ఫోటోగ్రాఫిక్ సొసైటీవారు నిర్వహించిన అఖిలభారత ఛాయాచిత్ర ప్రదర్శనలో శ్రీ ఎల్. మాలకొండయ్యగారు తీసిన ఈ చిత్రానికి మొదటి బహుమతి వచ్చింది.

కోల్పోని వరలక్ష్మి మనస్థైర్యానికి మెచ్చుకుంటూ లేచి నిలబడ్డాను.

చివరిసారిగా సెలవు తీసుకుని వెనుతిరిగాను. గడప దాటుతూంటే, వరలక్ష్మి చెయ్యి నా భుజంమీద పడింది. తల తిప్పిచూశాను. ఆవేదన మూటగట్టుకున్న కళ్లతో చూస్తోంది వరలక్ష్మి 'చెప్పు సుజాతా! నాలో నీకు ఏదోషమన్నా కనిపిస్తోందా?' అమాయకంగా అడుగుతోంది వరలక్ష్మి.

క్షణం శ్రావణ మేఘాల్లావున్న నా స్నేహితురాలి కళ్లలోకి జాలిగా చూశాను. మంచు బిందువులాటి ఆమె చరిత్రలో ఏకళంకాన్ని వెతకను?

మౌనంగా వరలక్ష్మి కళ్లనీళ్లు తుడిచి నా కన్నీరు దాచుకునే ప్రయత్నంలో, గిరుక్కున వెనక్కితిరిగి గబగబ అడుగులు ముందుకువేశాను. (అయిపోయింది)




**జరిగిన కథ**

లక్షాధికారి గారాల ముద్దుబిడ్డ శశిరేఖ తండ్రి ఆదరంతో తనతోపాటే మెడిసిన్ చదువుతున్న ప్రసాదును ప్రేమిస్తుంది. యుద్ధరంగంలో సైనికుల చికిత్సకోసం ప్రసాదు వెళ్తాడు. విరహంతో తల్లడిల్లుతున్న శశిరేఖను స్నేహితురాలు వాణి అనునయిస్తుంది. వాణికి శశిరేఖ రహస్యమంతా తెలుసు. అందుకే ఆమెని ఎగతాళి పట్టించింది.

## 4

# ప్రసాదు:

ఈ యుద్ధం భయంకరంగా సాగుతూ ఉంది—న్యాయా న్యాయాల మధ్య పోరాటం...ఎంత కాలం సాగినా ... ఎంత భయంకర రణంగా పరిణమించినా గెలుపు న్యాయానిదే !

అది లాహోర్ రంగం—

అటు పాక్ సైనికులూ, ఇటు భారతీయ సైనికులు పట్టుదలతో పోరాడుతున్నారు. ప్రాణాలను తృణప్రాయంగా ఎంచారు.

హుఁ...ఫలితం? కొందరు మరణించడం ...మరి కొందరు అవయవాల లోపాలతో అలమటించడం...

అయినప్పటికీ పోరు హోరాహోరి...

గాయపడిన సైనికులు అవిరామంగా కొనిరాబడుతున్నారు—

మా శాయశకు లా వారిని కాపాడేందుకు ప్రయత్నిస్తున్నాం—

భరతమాత ముద్దు బిడ్డలు — దేశ భక్తులు—

వారిని తలుచుకున్నప్పుడు...గర్వమూ... విచారమూ...

ప్రాణాలను సైతం లెక్క చేయకుండా పోరాడుతున్నందుకు గర్వం...!

జీవితాంతం అవయవాల లోపాలతో జీవించాలని తలచినప్పుడు—విచారం.

ఏ సైనికునికైనా అవయవ లోపం లేకుండా చికిత్స జరిపినపుడు నాకు ఎంతో ఆనందం కలిగేది.

ఆంగ్లేయులు మనను పాలించారు... బానిసలుగా చూశారు ...'స్వాతంత్రయోధుల ధాటికి తట్టుకోలేక తుదకు మనను స్వతంత్రులను చేశారు.

అది వారి మంచితనమే నేమో... ?

చిన్న సమస్యను సృష్టించారు—

హిందువులు—మహమ్మదీయులు—

దృష్టిలో ఉంచుకున్నారు—

అంతే...! రెండుగా చీల్చారు—

ఎప్పటికైనా రెండు మతాల మధ్య ద్వేషం కలగవచ్చని భావమా... ?

రెండు మతాలకు, దేశాలకు మధ్య ?

'కాశ్మీరు.'

అది ఒక చిక్కు సమస్యగా తయారైంది—

మాదంటే మాదని కీచులాట...

ఆనాడు భారతదేశంలోని కొన్ని భూభాగాలు మావంటూ వలిపారు దాడి; ఆ చైనీయులు.

ఈనాడు అందాలు చిందించే కాశ్మీరు మాదంటూ కయ్యానికి కాలు దువ్వుతున్నారు పాకిస్తానీయులు. పర్యవసానం... అమాయక ప్రాణుల బలి...చిత్రహింస.

భారతవీర సైనికులు ... మాతృదేశ హద్దుల రక్షణకై కృషి.

అబ్బ...! తలచుకుంటే నాకూ యుద్ధ రంగానికి వెళ్ళాలనిపిస్తూ ఉంది.

ఉహుఁ...వెళ్ళడానికి వీలులేదు...నే నొక డాక్టరుగా నా విధి నిర్వర్తించాలి...అంతే తప్పదు...

ఆస్పత్రికి వెడతాను—డ్యూటీ సమయం సమీపిస్తూ ఉంది.

ఇంతమంది గాయపడిన సైనికులలో రఘుతో పరిచయం ఎక్కువైంది నాకు—కారణం ? ఇరువురం ఒకేగడ్డన జన్మించడం ! రఘు...ధైర్యంగా నిల్చి పోరాడాడు. ఫలితంగా అతని కుడిచేతిని మణికట్టువరకు తీసివేయవలసి వచ్చింది—ఏ మాత్రం బాధ పడడం లేదు అతను—అవును ... ఆంధ్ర మాత వీరపుత్రుడు.

ఈ పరిస్థితిలో అతను చేయగలిగే దేమిటి... ?

యుద్ధం చేయ్యగలడా...? లేదు...మరి? దేశ రక్షణ కృషిలో యుద్ధ మొకటే ప్రాధాన్యం కాదేమో? రచయితగా పరిచయంలో తెలుపుకున్నాడు. కొన్ని గేయాలు వినిపించాడు. సమయానుకూలంగా సమయోచితంగా ఉన్నాయవి—

అతని రచనల ప్రభావం యువకుల

మత్తెబవరుస్తుంది—మత్తు నొదిలిస్తుంది—దేశ రక్షణోన్ముఖులనుగా చేస్తుంది—ఇంకేం కావాలి...?

అతను నా వైపే చూస్తున్నాడు—

'రఘూ...! ఏమిటా దీర్ఘాలోచన ?'

'ఏముంది ? ఈ విపత్కర సమయంలో యింత త్వరగా నిస్సహాయుడ నౌతాననుకో లేదు. ఇప్పుడిక నా కర్తవ్యం... ? మీతో వ్రాయించాను కదూ ... ఆ ఉత్తరాలకు సమాధానా లివి. ఇంటినుండి వచ్చాయి. ఆత్మీయులకు దూరమైనా వారినుండి వచ్చిన ఈ సానుభూతి నా మనసుకు ఎంతో శాంతిని, హాయిని కలిగిస్తూ ఉంది డాక్టర్! చదవండి...'

'మీ ఆత్మీయులు వ్రాసిన ఉత్తరాలివి... నన్ను...చదవమంటున్నారా ?'

'ఫర్వాలేదు... చదవండి. మీరు కూడా నా ఆత్మీయులే! సంకోచపడకండి—ఊఁ... అలా చూస్తున్నారేం ? కానివ్వండి.'

రెండు ఉత్తరాలూ చదివాను. మొదటి ఉత్తరం రఘుకు నిర్ణయించబడిన వధువు సరోజ వ్రాసినది.

ప్రియమైన రఘూ...!

మన పరిచయం విద్యార్థి దశలో చిగిర్చింది ...

ఆ దశ పూర్తయేసరికి పుష్పించి, ఫలించింది—.

పెద్దల ఆశీర్వాదంకూడా లభించింది—ఎంతో అదృష్టవంతురాలననుకున్నాను.

కాని అనుకోని విధంగా విధి విధించింది వియోగం —

ఐనా నిన్ను తలచని క్షణం లేదునాకు—వియోగంతో అలమటిస్తున్న నా మది చల్లని కబురు తెలియడంతో పొంగిపోయింది సంతోషంతో—.

'కుడిచేతిని మణికట్టు వరకు తీసివేశా రని, నన్ను మరిచిపోయి వేరేవారి నెవరి నైనా వివాహమాడవలసినదని' కదూ వ్రాయించావు.

ఆ విధంగా ఎలా వ్రాయించ గలిగావు ?

నీ త్యాగం—నీ ధైర్యం—నీపై మునుపటి కన్న ప్రేమను యినుమడింపజేస్తున్నాయి—నీకు కలిగిన అంగవైకల్యానికి నా హృదయ పూర్వక సానుభూతి ఎప్పుడూ వుంటుంది—.

ఎటువంటి సంకోచాలూ నా మనసులో లేవు.

అనుమానించకు— చిరునవ్వుతో వచ్చేయ్!

ప్రత్యక్షంగా ఈ విపత్కర పరిస్థితి



ఎదుర్కోలేక పోతున్నానని బాధపడుతున్నావు కదూ...? విచారించకు...పరోక్షంగా తోచిన సాయం చేద్దువుగాని. నీవు కవివి...వ్రాయలేని పరిస్థితికి చింతించకు. నేను వ్రాయగలను ఎంతైనా చేయగలము. శలవ్...! ఉంటాను.

......!
నీ సరోజ

రెండవ ఉత్తరం రఘుతండ్రి వ్రాశాడు. ఆప్యాయత సానుభూతి ఆ ఉత్తరంలోనిండి ఉన్నాయి.

నా కన్న ఈ రఘు ఎంతో అదృష్టవంతుడు...అవును ... సందేహం లేదు.

రఘుకు కన్న తలిదండ్రులు, అప్పచెల్లెండ్రు, ప్రియురాలు అందరూఉన్నారు— బాధలో ఉన్నప్పటికీ వారి సాంత్వన వచనాలతో నిండిన సానుభూతి లభిస్తూఉంది— అంతకన్న అదృష్టమింకేం కావాలి? మరి నాకు...? కన్నతల్లి అతి పిన్నవయసులో నన్నొదిలి వెళ్ళింది. తండ్రి ప్రపంచ జ్ఞానం తెలుస్తున్న రోజులలో నన్ను దూరం చేసుకున్నాడు. అందుకు ఎవరినీ నిందించలేను. అది నా దురదృష్టం కాదు. ఒకవిధంగా అదృష్టమే. కాదనలేను...కారణం .తల్లిదండ్రులను పోగొట్టుకున్న నేను డా. విశ్వంగారిచెంత చేరాను. రేఖాదేవి విశ్వంగారి ఏకైకపుత్రిక .. వారే నా మార్గదర్శకులు—జీవిత సర్వస్వం. వారి ఆదరణ, ఆప్యాయత, సహాయ సానుభూతులే నా ఈ ప్రస్తుత పరిస్థితికి నిదర్శనాలు ..

'డాక్టర్! ఏమాలోచిస్తున్నారు?'

'నీ అదృష్టాన్ని మనసులో అభినందిస్తున్నాను — తల్లి, తండ్రి, అప్పచెల్లెళ్ళు, ప్రేయసి, యిందరున్నారు నీకు నీ ఆరోగ్యంకోసం— క్షేమంకోసం— అహర్నిశలూ అలమటిస్తూ ఉంటారు— ఒక వ్యక్తికి అంతకన్న వేరే భాగ్యమేముంటుంది రఘూ?'

'అదేమిటి డాక్టర్! మీకు ఎవ్వరూ లేరా?'

'లేరు — ఉన్నారు. తల్లి, తండ్రి, తమ్ముడు అంతా ఉన్నారు నాకు కాని వారికి నేను లేను—బాల్యంలో దూరమయ్యాను— నాకు ఏమీకాని డా. విశ్వంగారు వారి కుమార్తె శశిరేఖాదేవి; వారే నా ఆత్మీయులు— నాకు వారు— వారికి నేను

# గూడుచేరిన పక్షులు

ఉన్నాము. నా సర్వస్వం వారే! తల్లి, తండ్రి, ఆత్మబంధువులు.

పై మాటలని, డ్యూటీ సమయం దాటుతూ ఉండడంవల్ల కలతపడిన మనసుతో క్వార్టర్సువైపు నడిచాను.

* * *

విశ్రాంతిగా నా బెడ్ పై నడుము వాల్చాను. ఏవేవో ఆలోచనలు నా మనసును చిందరవందరచేయడ మారంభించాయి. రేఖాదేవి...ఆ తలంపే నా జీవనజ్యోతి. ఎంత అందం? ఎంత ఆకర్షణ? అంతటి ధనికులు...గర్వం...ఆడంబరం మచ్చుకు కూడా కనుపించదు. ఈ దీనునిపై వారి కెంత ఆప్యాయత? ఆమెకు నేనంటే అమితమైన ప్రేమ, ఆదరణ. బహుశా యిది ఈ జన్మకు సంబంధించిన బంధంలా కనుపించడం లేదు ఎన్నిజన్మల బంధమో? మళ్ళీ ఈ జన్మలోకూడా మమ్ములనిద్దరినీ బంధించింది. ఆమెను చూడందే ఉండలేని స్థితికి వచ్చానంటే...? మానసికంగా నేనెంత దుర్బలుణ్ణయ్యానో? అది నా దోషమా? కాదు... రేఖాదేవి ఆకర్షణ...! ఆ చిలిపితనం...హుషారు...! డాక్టరు బాబుగారు ఆమెను పువ్వులలోపెట్టి పెంచుతున్నారు కాలు క్రింద పెట్టనివ్వరు... కదిలితే కందిపోతుందన్నట్లుగా పెంచారు. ఇప్పటికీ అలాగే చూస్తున్నారు.

మొదట్లో రేఖాదేవికి ఎంతో దూరంగా ఉండాలని ప్రయత్నించాను. అందుకు కారణాలు ఎన్నో ..? అయినా నా ప్రయత్నాలు ఫలించలేదు. డాక్టరు బాబుగారి అభిప్రాయం తెలిసేంతవరకు ఆమెలో మాట్లాడుతూనున్నప్పుడల్లా గుండె దడదడుతూ ఉండేది. కాని ఆమెమాత్రం జంకుగొంకు లేకుండా యిష్టం వచ్చినంతసేపు మాట్లాడుతూ ఉండేది. ఆరోజు గండిపేట వద్ద నా మనసులో ఉన్న సంకోచాన్ని వెల్లడి చేసినప్పుడు ఎంతగా అభినందించింది? ఆమెతో ఆ విషయాలు మాట్లాడిన తర్వాత బాబుగారి ఉద్దేశ్యం తెలుసుకునే అవకాశం ఎప్పుడు లభిస్తుందాఅని నేను వేయికనులతో ఎదురుచూశాను వారు ఒక రోజు రేఖాదేవి వివాహవిషయాలను నాతోనే చర్చించడ మారంభించారు. నర్సింగ్ హోం నుండి తిరిగివచ్చి నా గదిలో విశ్రాంతి తీసుకుంటున్న సమయంలో సీతమ్మవచ్చి 'చినబాబూ! అయ్యగారు పిలుస్తున్నారు. పైన తమ గదిలో ఉన్నారు' అని చెప్పి వెళ్ళిపోయింది.

ఆ వేళప్పుడు నన్నెందుకు పిలుస్తున్నారో నా కర్థంకాలేదు. ఎప్పుడూ మధ్యాహ్న సమయంలో వారు నన్ను మాట్లాడించి ఎరుగరు. ఏమి మాట్లాడుతారో...? ఏమడుగుతారో...? గుండెలు పీచుపీచుమన నారంభించాయి. డాక్టరు బాబుగారితో నేనెప్పుడూ ఎక్కువగా మాట్లాడను. ఏ అవసర మొచ్చినా రేఖాదేవిద్వారా తీర్చుకొనే వాడిని ఒక్కసారి మాత్రం వారితో మాట్లాడి నా భవిష్యత్తును నిర్ణయించుకున్నాను ఎమ్మెస్‌లో క్లాసువచ్చిన విషయం వారికిచెప్పి వారి పాదాలకు నమస్కరించబోయాను. నన్ను వారించి లేవదీసి ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చోవలసిందిగా ఆదేశించారు.

'బాబూ ప్రసాద్! అదృష్టవంతుడివి... పట్టుదలలో చక్కని భవిష్యత్తును సాధించగలిగావ్? హృదయపూర్వకంగా నిన్నభినందిస్తున్నాను మరి! ముందు సంగతేమాలోచించావ్?' నావైపు ప్రేమలో చూస్తూ ప్రశ్నించారు

'మీ ఆదరాభిమానాలు లేనినాడు నా పట్టుదల ఎందుకు పనికివచ్చేదంటారు? నా జీవితంలో మీరు తటస్థపడి బరువు బాధ్యతలు స్వీకరించకపోతే నా పరిస్థితి ఏమయ్యేదో? మీ ఋణాన్ని ఎలా తీర్చుకోగలను? ఇక ముందు సంగతంటారా? మీరెలా చెబితే అలా..! మీ కెదురు చెప్పను'

'ఇందులో నాదేముందయ్యా! నేనేం చేశాను? కష్టపడ్డావు పైకొచ్చావు. నాకు వయసు పైనబడుతూవుంది నర్సింగ్ హోం పనిని నేను ఒంటరిగా చూసుకోలేను. నాకు అసిస్టెంటుగా పనిచేస్తావా? జీతమెంత యివ్వమంటావ్?'

'బాబుగారూ! నాకు జీతమిచ్చి మీ నుండి వేరుచేస్తారా? అదెప్పటికీ సాధ్యపడదు ఇలాగే మీదగ్గర నా జీవితాంతం గడుపుతాను. దయచేసి యికముందెప్పుడూ యిటువంటి మాటలనకండి.'

నా కళ్ళు చెమర్చాయి — మాట పొరబోయింది.

# రోజు కొక చెంచా-
# శక్తిని వృద్ధిచేస్తుంది



SYRUP MINADEX

## మంచి కను దృష్టి:

సిరప్ మినాడెక్స్‌లో విటమిన్ ఎ కలదు. కంటి యొక్క దివ్యమైన దృష్టి కొరకై రోజుకు 1 చిన్న చెంచాడు సిరప్ మినాడెక్స్ చాలును.

## ఆరోగ్యకరమైన రక్తం:

సిరప్ మినాడెక్స్‌లో ఐరన్ కూడ గలదు. భారతదేశంలో అత్యధికులు (80%) ఐరన్ లోపించిన ఆహారం భుజిస్తున్నారు. కావున 1 చిన్న చెంచాడు సిరప్ మినాడెక్స్ అతి త్వరగా ఆ లోపాన్ని నింప గల్గుతుంది.

## దృఢమైన ఎముకలు:

సిరప్ మినాడెక్స్‌లో విటమిన్ డి కూడ గలదు. ప్రతి రోజూ 1 చిన్న చెంచాడు సిరప్ మినాడెక్స్ తీసుకొన్నచో ఎముకలకు మంచి దృఢత్వమును కలుగజేస్తుంది. గుర్తుంచుకోండి, రోజూ 1 చిన్న చెంచాడు నారింజ సువాసనగల మినాడెక్స్ బిడ్డకు మూడంతలు ఆరోగ్యరక్షణ నిస్తుంది.

సిరప్

# మినాడెక్స్ ®

ఒకే చెంచాలో మూడు గుణములుగల టానిక్

గ్లాక్సో

CMGM-4.244 Tel

# గూడుచేరిన పక్షులు

'అలాగే ప్రసాద్...!'

నన్ను వారి కౌగిలిలో చేర్చుకొని ఆనంద భాష్పాలు రాల్చారు. ఆ సందర్భంలో తప్ప అంతకుముందు ఎప్పుడూ వారితో మాట్లాడి ఎరుగను. ఈ విషయం జరిగి నెలరోజులు కాలేదు. నాకోసం ఎందుకు కబురు చేశారా అని ఆలోచిస్తూ అడుగులో అడుగు వేస్తూ మెల్లగా వారిగదికి వెళ్ళాను. నన్ను చూసిన వారు చదువుతూన్న పుస్తకాన్ని మూసి ప్రక్కన బల్లపై ఉంచుతూ 'రా బాబూ! ఇలా వచ్చికూర్చో' అని కుర్చీ చూపించారు.

నేను కూర్చున్న తర్వాత 'బాబూ! జీవితంలో నా సమస్యలు ఒకటొకటి తీరి పోతున్నాయి...తీర్చుకోవలసిన వయసునాది. నర్సింగ్‌హోం బాధ్యత నిశ్చితంగా నీపై వేశాను అంతకుమించిన గొప్ప బాధ్యత తీర్చుకోవలసి ఉంది. రేఖ! తల్లిలేనిపిల్ల తల్లీ ... తండ్రీ నేనుగా పెంచాను. ఈ సంవత్సరమే హౌసుసర్జను పూర్తి చేసిన విషయం నీకు తెలుసు. రేఖకు ఆ మూడుముళ్ళూ పడవేస్తే నాబాధ్యత తీరినట్లే! ఏం చేయాలో తోచటంలేదు నిన్ను నా కుటుంబ వ్యక్తిగా భావించి ఈ విషయాలు నీతో చెబుతున్నాను రేఖకు ఈరోజు ఒక మంచి సంబంధం వచ్చింది కుర్రవాడు తెలిసినవాడు—బాగా ఆస్తిపాస్తులున్నాయి. నీలాగే డాక్టరు. ఎమ్. డి. పూర్తిచేశాడు అందగాడు అమ్మాయికి ఆ మూడుముళ్ళూ వేయించి నిశ్చింతగా ఉంటాను. విశ్రాంతిగా కూడా ఉంటుంది. ఈ విషయంలో నీ అభిప్రాయ మేమిటి? ఇంకా ఈసంగతి అమ్మాయికి తెలియదు.'

నాగుండెల్లో రైళ్ళు పరుగెత్తాయి .. కళ్ళు బైర్లు కమ్మాయి.. రేఖాదేవిని విడిచి జీవించగలనా...?ఎలా జీవించగలను...?

'ఏం బాబూ ఆలోచిస్తున్నావ్?'

'....................'

'ప్రసాద్! ఏమిటలా అయిపోతున్నావు ఒంట్లో కులాసాగా లేదా ..?'

'అబ్బే! ఏం లేదండి ..ఎందుకో కళ్ళు తిరుగుతున్నాయి.'

నా కంగారు పైకి కనుపించనీయకుండా సమాధానం చెప్పాను—

'అవుతే ... వెళ్ళి విశ్రాంతి తీసుకో బాబూ...!'

నాగదికి ఎలాచేరానో నాకే అర్థం కాలేదు. ప్రపంచమంతా శూన్యంగా తోచింది. నాకాళ్ళ కింది నేల గిర్రున తిరుగుతున్నట్లు తోచసాగింది. ఆ తర్వాత క్రమంగా మనసు కుదుటపడింది. ఒకటి రెండు రోజులు అన్నం సహించలేదు నాకు. ఈ విషయం సీతమ్మకు చెప్పక తప్పలేదు ఎంతో బలవంతంచేసి నానుండి తెలుసుకుంది

'అవా బాబూ ...! అయినా నీవు అందనిపండ్లను ఆశిస్తున్నావేమో...'

'లేదమ్మా! అటువంటిదేమీ లేదు. రేఖాదేవి నన్ను మనస్ఫూర్తిగా ప్రేమిస్తూ ఉంది ఒకసారి ఈవిషయం నాతో స్పష్టంగా చెప్పిందికూడా నా పరిస్థితి అయోమయంగా ఉంది. ఆమెను చూడకుండా ఒక్కక్షణం గడపలేక పోతున్నాను. మాయిద్దరి మనసులూ ఏకమైనప్పటికీ యింతకాలం బాబుగారి నిర్ణయంకోసరం ఎదురు చూశాము నాకై నేను ఈ విషయం వారివద్ద ప్రస్తావించడం బాగుండదు తారతమ్యాలు ఊహించుకొని వారు బాధపడడం జరుగుతుందేమో? 'ఇంతకాలం నా యింట్లో ఉండి చదువుకొని ఈ పరిస్థితికి దిగజారాడు' అని వారు అనుకొనేందుకు ఆస్కారము ఉండరాదు మొన్న అమ్మాయిగారి వివాహ విషయం నాతో సంప్రతించారు బాబుగారు. కాబోయే అల్లుడుగారు కూడా మా మాదిరిగానే డాక్టరు బాగా ఆస్తిపాస్తులున్నవాడట! అంతవరకు తెలిసేసరికి నాకు కంగారు కలిగింది. నాలో మార్పు గుర్తించి ఆరోగ్యం బాగాలేదని ఊహించి విశ్రాంతి తీసుకోవలసిందని చెప్పారు జరిగిన విషయం యిది ఈ విషయం నాలోనే ఉండిపోవాలని ఊహించుకున్నాను కాని తల్లిలాంటి నీకు చెప్పక తప్పలేదు. ఈ విషయం రేఖాదేవికీ యింకా తెలిసిందో తెలియలేదో. . నా రేఖాదేవి. .'

నా వాక్యం పూర్తి కాకుండానే 'నాకంతా తెలిసిందయ్యా! అమ్మాయిగారికి కూడా ఈ విషయం తెలిసింది అప్పటి నుండి ఆమె పరిస్థితి కూడా యిలాగే ఉంది. చిన్నప్పటినుండీ గారాబంగా పెంచారు అమ్మాయిగారి మాటను బాబుగారు, బాబుగారి మాటను అమ్మాయిగారు యింతవరకు కాదనడం నే చూడలేదు. ఇప్పటి ఈ పరిస్థితి విచిత్రంగా ఉంది. బాబుగారు అమ్మాయిగారి మనసు గ్రహించినట్లు లేరు. వారు చెప్పకపోవడమే గాని అమ్మాయిగారిని మాట్లాడనివ్వలేదు. ఆ సంబంధం వారికి అంతగా నచ్చి ఉండవచ్చు. అమ్మాయిగారు కూడా లోచక తికమక పడుతున్నారు. ఈ విషయంలో నీవు మాత్రం త్వరపడవద్దు. మాట పడవలసి వస్తుంది. మనసు కుదుటపరచుకొని ఏం జరుగుతుందో గమనించు ఓపికతో! అమ్మాయిగారు పూర్తిగా సందిగ్ధావస్థలో పడిపోయారు. ధైర్యంచేసి బాబుగారికీ చెప్పలేకపోతున్నారు. బాబుగారివి త్వరపడి ఒక నిర్ణయానికి వచ్చే మనస్తత్వం కాదు. ఓపిక పట్టడమే ప్రస్తుత కర్తవ్యం...! నే వస్తా బాబూ! పనంతా అలాగే ఉండి పోయింది—'

సీతమ్మ వెళ్ళిపోయింది. గుండె దిటవు పరచుకొని ఎంతో ప్రయత్నం మీద మామూలుగా నవ్వుతూ పేలుతూ తిరగ సాగాను

వారం రోజులు గడిచిపోయాయి. ఒక రోజు నర్సింగ్‌హోంలో అవుట్ పేషెంట్లను పంపించివేసి మేల్‌వార్డు వైపు బయలు దేరాను. అంతలో నర్సు రాధ వచ్చి రేఖాదేవిగారు పిలుస్తూ ఉన్నట్లు చెప్పింది. వారం రోజులుగా తప్పించుకు తిరుగుతూన్న నేను, ఇప్పుడు వెళ్ళక తప్పలేదు వెళ్ళి ఆమెకు ఎదురుగా కూర్చున్నాను ఎప్పుడైనా ఏమైనా సలహాలు కావలసివచ్చినప్పుడు ఆమె పిలవడం నేను వెళ్ళడం మామూలే! ఆ రోజు కూడా ఏమైనా తెలుసుకోవడానికి పిలిపించిందేమోనని ఊహించి 'ప్రత్యేకంగా చూడవలసిన కేసులుగాని, ఎక్స్‌రేలు గాని ఉన్నాయా ..' అని ప్రశ్నించాను.

'ప్రసాద్! నీకు దిమ కుట్టినట్లుగా లేనట్లుందే! హాయిగా, కులాసాగా నవ్వుతూ పేలుతూ తిరుగుతూ ఉన్నట్లు పైగా నా దగ్గర మాత్రం మార్పుదానికి ప్రయత్నిస్తున్నావు అయినా మొదటినుండి గమనిస్తూనే ఉన్నాను ఎన్నిసార్లో నన్ను తప్పించుకోవాలని ప్రయత్నించావ్! ఇది

నీకు న్యాయంగా ఉందంటావా?'

రేఖాదేవి మాటలు నన్ను నిర్ఘాంత పరచాయి. మెల్లిగా తేరుకొని 'అసలు విషయం తెలుసుకోకుండా మాట్లాడు తున్నారు. మీకు ఏదో సంబంధం వచ్చిం దని తెలిసినరోజు నా పరిస్థితి ఆ భగ వంతుడికే తెలియాలి. రెండురోజులు అసలు అన్నం సహించలేదు .. ఆ రెండురాత్రులూ కంటిమీద కునుకులేదు. ఈవారం రోజుల నుండి మీకు దూరంగా ఉండాలని ఎంతగా ప్రయత్నిస్తూ నటిస్తూ ఉన్నానో ఆ భగ వంతుడికే తెలియాలి. ధైర్యంచేసి మీ నాన్నగారిని అడగలేను. అసలు వారితో మాట్లాడాలంటేనే నాకు భయం ఒకవేళ ధైర్యంచేసి మాట్లాడినా వారు అపార్థం చేసుకుంటారేమోనన్న భయం. దీనికి తరుణోపాయం నీవే చూడాలి.'

'ప్రసాద్! నేను కూడా ఎంతో బాధ పడుతున్నాను. నాన్నగారిని నొప్పించలేక పోతున్నాను. నన్ను ఎంత ఆప్యాయంగా పెంచారు? నీకు తెలియనిదేముందని? వారికి ఆ సంబంధం బాగ నచ్చింది నేను ఈ విషయంలో వారితో మాట్లాడాలని కూడా విరమించుకున్నాను ఏం చేయాలో తోచడం లేదు ఇంతకాలం కలిసిమెలిసి తిరిగాం .. చదువుకున్నాం .. ఒకరి సమస్యల నొకరం పంచుకున్నాం. కాని యిది మన యిద్దరి మీదకు ఒకేసారి వచ్చిపడిన చిక్కుసమస్య. నా కర్తవ్యమేమిటో బోధపడడంలేదు ... అంతా అయోమయంగా ఉంది. ఆ భగవంతుడి దయవల్ల ఈ సమస్య దానంతట అదే తీరి పోతే హాయిగా ఉంటుంది ..కాని ఎలా తీరు తుంది. ఈరోజు పెళ్ళిచూపులకు వస్తా రట! ఏన్నేం చేయమంటావు ప్రసాద్?'

'........ ....'

'మాట్లాడవేం?'

కన్నీరు దాచుకోవాలని వ్యర్థప్రయత్నం చేస్తూ గద్గదకంఠంతో అంది రేఖాదేవి నాకూ కన్నీరాగలేదు మాట పెగిలిరాలేదు. ఆ స్థితిలో యిద్దరమూ కొన్ని క్షణాలు గడిపాము. ఎంత ఆలోచించినా పరిష్కార మార్గం కనుపించలేదు మాకు—

'అమ్మాయిగారూ! నేను చివరిమాటుగా చెబుతున్నాను ... నిండు హృదయంతో, సన్నద్ధం చేసుకోవాలి .. విధి వక్రించి మీరు నాకు దక్కకపోయినా నా ప్రాణాలనైనా త్యజించడానికి సిద్ధపడతానేగాని ఈ విష యాన్నిమాత్రం బాబుగారితో నేను మాట్లాడలేను. నిజంగా నేను దురదృష్ట వంతుణ్ణి. నావారందరూ నాకు దూర మైనా మిమ్ములను పొంది యింతకాలం మొండిగా బతికాను. మీరే నాకు లేని నాడు నా ఈ జీవితమే వ్యర్థం.. నేను మీ వాణ్ణి ... అంతకుమించి యిక మాట్లాడ లేను...మన్నించండి' ఎంతో కష్టంమీద ఆ చివరిమాటలు నా నోటినుండి వెలు వడ్డాయి—

నన్ను ఆ పరిస్థితిలో చూసిన రేఖాదేవి నిలువునా కృంగిపోయింది—

'ప్రసాద్! నీ పరిస్థితి నేనర్థం చేసు కున్నాను. నీవు నా వాడివి కానినాడు నేను మాత్రం వేరే ఎవ్వరితోనో సుఖపడగలనా? నీ అడుగు జాడల్లోనే నేనున్నా...అయినా నా శాయశక్తులా ప్రయత్నిస్తాను. సీత మ్మతో సంప్రతించి నాన్నగారితో మాట్లాడ మని చెబుతాను. ఒకవేళ నా ప్రయత్నాలు విఫలమౌతే మనమేం చేయాలి ప్రసాద్? ఈ పరిస్థితులు చూస్తూ ఉంటే పిచ్చి ఎక్కేటట్లు ఉంది. అలా జరిగినా బాగుండే దేమో...? ఈ బాధలు ... బాధ్యతలు .. ఓహ్! తల బద్దలౌతూ ఉంది...'

పై మాటలని కన్నీరు కార్చింది ఆమె.

అన్ని విధాల అదృష్టవంతురాలైన రేఖా దేవి పై నా నీడ పడడంతో యిన్ని బాధలు, సమస్యలు వచ్చాయి. నేను వీరి కుటుంబంలో ప్రవేశించి ఉండకపోయినట్లయితే ఈ సమ స్యలు, చిక్కులు ఆమెకు వచ్చేవేనా? ఆ విషయమే పైకి అనబోయాను కాని నా ఉద్దేశాన్ని గుర్తించి నానోటిని తన సున్నిత మైన వ్రేళ్ళతో మృదువుగా మూసింది. అంతలో బయట ఏదో అర్జంటు కేసు రావడంతో తప్పనిసరై ఆమెవద్ద శలవు తీసుకొని వెళ్ళిపోయాను.

ఆ తర్వాత ఒకరోజు పెళ్ళిచూపులు సవ్యంగా జరిగిపోయాయి. ఆ సంఘటన తర్వాత యిద్దరమూ పూర్తిగా దిగజారి పోయాము. రేఖాదేవిని మగపెళ్ళివారంతా నచ్చడం, తదితర ముఖ్య విషయాలు మాట్లాడుకోవడంకూడా జరిగిపోయింది. మంచిరోజుచూసి లగ్న నిర్ణయం చేసుకోవ డానికి యిరువురూ నిర్ణయించుకున్నారు. బాబుగారితో మా విషయం మాట్లాడ డానికి సీతమ్మకుకూడా ధైర్యం చాల లేదట! మా ఆశలు అడుగంటి పోయాయి. మా ముఖాలలో నెత్తురుకు నెత్తురు చుక్కలేకుండా పోయింది. తుదకు ఆ భగ వంతుడిపైనే భారం వేశాము.

**(ఇంకా ఉంది)**



'పాక్‌కు అమెరికా సహాయం—

# వారఫలం

**7-1-1972 శుక్రవారం మొదలు**
**13-1-1972 గురువారం వరకు**

**మేషం** అనవసరమైన సందేహాలు కలుగుతాయి. వృత్తిలో పోటీదారి పోటీ పెరుగుతుంది. ప్రయాణాలు ఫలిస్తాయి. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును.

స్త్రీలకు.— ఆరోగ్యం బాగా ఉంటుంది. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**వృషభం** వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. ఏ వ్యవహారంలోను యితరుల మీద ఆధారపడడం తగదు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అలంకార వస్తువులు కొంటారు.

**మిథునం.** అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. వారం మధ్యలో వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. పోటీదారితో వాద ప్రతివాదాలు తగవు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుంటుంది. దైవ కార్యాలు నెరవేరతాయి.

**కర్కాటకం:** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. కొన్ని వ్యవహారాల్లో మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. విద్యావైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

స్త్రీలకు:— సంతోషకరమైన వార్తలను వింటారు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**సింహం:** మీ ఆలోచనలు ఫలిస్తాయి. ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి. వ్యాపారంలో పోటీదారి పోటీ తగ్గుతుంది. రాజకీయ వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. వారం ఆఖరులో ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**కన్య.** అన్ని వ్యవహారాలు అనుకొన్నట్లుగా నెరవేరతాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది.

స్త్రీలకు.— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**తుల** వృత్తిలో శ్రమ కలుగుతుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి. అధిక వ్యయం జరుగుతుంది. వారం మధ్యలో అన్ని వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. సూతన విషయాలను తెల్సుకొంటారు.

**వృశ్చికం:** వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. వారం మధ్యలో మీ తాలూకు వస్తువులు పోవచ్చును. ఉద్యోగంలో చికాకులు యేర్పడతాయి. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు తిరిగి బాగుంటాయి.

స్త్రీలకు.— కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**ధనుస్సు** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ప్రయాణాలు ఫలిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. మిత్రుల సహాయం లభించగలదు. వారం ఆఖరులో ఆకస్మికంగా వ్యతిరేకత యేర్పడుతుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**మకరం.** వృత్తిలో అనుకూల వార్తలను వింటారు. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. మీరు యిదివరకు చేసిన ప్రయత్నాలు యిప్పుడు ఫలిస్తాయి.

స్త్రీలకు—వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. పుణ్యకార్యాలు చేస్తారు.

**కుంభం.** సహాయం చేస్తామన్నవారు సమయానికి తప్పుకో వచ్చును. మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. వారం మధ్యలో వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు. సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. బంధువులకు సహాయం చేయ గలరు.

**మీనం** ప్రయత్నించిన ప్రతి పని సులువుగా నెరవేరగలదు. పోటీదారిలో గౌరవం లభిస్తుంది. వారం మధ్యలో చికాకులు యేర్పడతాయి. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాలు వాయిదా పడతాయి.

—సుభాష్

# కలిసి పయనించటం లాభదాయకం!




మీరు ఒక గుంపుగా ప్రయాణం చేస్తే ఎయిర్-ఇండియా వారి ఎఫినిటీ గ్రూపు స్కీము క్రింద తక్కువ, చాలా తక్కువ ఛార్జీలు చెల్లించవలసి ఉండును.

**ఎటువంటి గుంపులు ఇందుకు అర్హులు ?**

మీ గుంపులో కనీసం 15 మంది సభ్యులైనా ఉండాలి. మీరంతా కనీసం 6 మాసాల పాటైనా ఒకే స్కూలు/కాలేజి, ఇన్‌స్టిట్యూట్, ఫర్మ్, క్లబ్, సొసైటీ, కార్పొరేషన్, అసోసియేషన్ లేక సమాఖ్యకు చెందినవారై ఉండాలి.

**ఎటువంటి ప్రయోజనానికి ?**

ఒక కాన్ఫరెన్స్ లేక కన్వెన్షన్‌కు హాజరవ్వటానికి గాని లేక కులాసా కోసం గాని మీరు ప్రయాణం చెయ్యదలచినట్లైతే మీకా తగ్గింపు సదుపాయం లభించగలదు. ఎయిర్–ఇండియా మీ గుంపులో భాగముగా మీ భార్య/భర్త మరియు పిల్లలను కూడా చేర్పటానికి అంగీకరించగలదు. నిజంగా మీరు ఎంతో డబ్బు—కొన్ని సెక్టర్లలో ఒక్కొక్క ఛార్జీ మీద రు. 2000 లకు పైగా—ఆదా చేసుకోగల్గుతారు.

వీటిని గురించి మీ ట్రావెల్ ఏజెంటును సంప్రదించండి. గ్రూప్ ఇంక్లూజివ్ టూర్ స్కీము క్రింద కలిసి ప్రయాణం చేసే 10 మంది గల గుంపుకు విమాన ఛార్జీలలో, హోటల్ బుక్కింగులలో, వివిధ ప్రదేశాలను చూడటానికి ఏర్పాటు చేసిన టూర్లలో తక్కువ రేట్ల ప్రయోజనం మీకు లభిస్తుంది మీ ట్రావెల్ ఏజెంటు 21-రోజుల యూరపు పర్యటనను కేవలం రు. 5,800లకు మాత్రమే ఏర్పాటుచేయగలరు.

మీ స్థానిక ఎయిర్-ఇండియా ఆఫీసు లేక మీ ట్రావెల్ ఏజెంటును పూర్తి వివరాలకై సంప్రదించండి. కలిసి ప్రయాణం చేయటం ఎంతో లాభదాయకమని మీరు తెలుసుకోగల్గుతారు.

**ఎయిర్-ఇండియా**

మిమ్మల్ని ప్రేమించే ఎయిర్‌లైన్



'మనమిద్దరం పెళ్లిచేసుకుంటే మన సంతతికి నా అందమూ మీ తెలివి తేటలు వస్తాయి' అన్నదిట వో అందగత్తె బెర్నార్డ్‌షాతో. దానికా మేధావి ఏమన్నాడో తెలుసా? 'నిజమే కాని నీ తెలివితేటలు నా అందము వచ్చే ప్రమాదం కూడా వుంది. అది భరించగలమా అని'

'మీ రెన్నైనా చెప్పండి. పులి కడుపున పిల్లి పుడుతుందిటండీ?'

'అమ్మాయికిప్పుడు పదోనెల నగపడింది. కాబట్టి ఖాయంగా ఆడపిల్లే. మొట్ట మొదట ఆడపిల్ల పుడితే కలిసి వస్తుందిట. మాయింట్లో అందరికీ ఇది ఆనవాయితీయే. మొదటికాన్పు ఆడపిల్లే.'

'ఏమోనమ్మా, ఈసారన్నా మాకోడలికి మొగపిల్లవాడు పుడితే ఆపరేషన్ చేయిద్దా మను కుంటున్నాం. ఈ సురోమని చేసుకో లేకుండా ఉంది ఒకరా ఇద్దరా నలుగురు ఆడకుంకలు.'

మెటర్నిటీవార్డు వందు రకరకాల వ్యక్తులు. ఆడమగ; చిన్న పెద్ద బీదబిక్కి— అందరూ ఇష్టంవచ్చినట్లు మాట్లాడు కుంటున్న మాటల్లో డా. వేణుకి విన్పిం చిన కొన్ని సంభాషణలు మాత్రమే ఇవి.

అందరిమాటల సారాంశం ఒక్కటే— పుట్టబోయే శిశువు అది ఆడా మగా? ఎవరి రూపును పోలివుంటుంది? ఎవరి గుణగణాల్ని పుణికి పుచ్చుకుంటుంది? వంశ పారంపర్యంగా వచ్చే అందమైన సొట్టబుగ్గలు వుంటాయా? పిల్లి కండ్ల లాంటి తెల్లని కనుగుడ్లు ఇకనైనా రాకుండావుంటే బావుండ్ను...

అంతర్గ్రహ యాత్రల్ని అవలీలగ చేస్తున్న నేటిమానవుడు పుట్టబోయేబిడ్డ లింగభేదాన్ని ఎందుకు నిర్ణయించలేక పోతు న్నాడు? పుట్టుకతోనేవచ్చే అంగవైకల్యాల్ని మానసికరుగ్మతల్ని ముందుగా ఎందుకు కని పెట్టలేక పోతున్నాడు? కనిపెట్టి వాటిని నివారించే ఉపాయం ఆలోచించడేం?

వేణు మనసులోని ఆవేదనకు భయా నికి మూలకారణమై సమాధానం దొరకని కొన్ని ప్రశ్నలు మాత్రమే ఇవి.

తను సారస్వతంలో పరిశ్రమించి డాక్టరేట్ సంపాదించాడేగాని, వైద్యవృత్తిలో డాక్టరేట్ సంపాదించివుంటే తన ప్రశ్నల

సమాధానానికై పరిశ్రమించే వాడేమో.

'అమ్మకీ ఆలోచన వచ్చి వుండదు. వస్తే తనని మెడిసినే చదివించేది!

శారదకు పుట్టబోయే బాబుకి మెడిసిన్ చెప్పించాలి. కాని...కాని ఆబాబుకి తాతపోలిక వస్తే...

మధ్య మధ్య ఒకరిద్దరు నర్సులు బయటికొచ్చి వెళ్తున్నారు. లోపల్నుండి మూలుగులు కేకలు, ఆక్రందనలు...

'సిస్టర్...ఆ రో నెం బ రు గదిలో పేషెంటు...' ఏదో అడగబోయిన వేణు ప్రశ్న పూర్తిగాకుండానే నర్సు వెళ్ళి పోయింది.

శా ర ద ఎ లా వుం దో...పు రు డు పునర్జన్మట...శారద, శారదాంబ...అనవసర మైన విషయాల్ని జ్ఞప్తికి తెస్తుంది, అవసరమైన వాటిని మాత్రం బయట పెట్టదు ఈమనసు.

'నమస్కారం డాక్టరుగారూ'

వేణు ఉలిక్కిపడి ప్రక్కకి చూశాడు. పోమధ్య వయస్కుడు మెళ్ళో రుద్రాక్షల మాల మొహాన గంధాక్షతలు, చెవులకు కుండలాలు చేతిలో ఒకటిరెండు పుస్తకాలు...

'నన్నేనా మీరు పిల్చింది?'

'సందేహ మెందుకండీ మీరు నన్నెరుగ రేమోగాని, నాకు మీరుతెలుసు. 'శారదా నిలయం' ఇంటిముందు 'డా. వేణు' అనే బోర్డుచూసి మీరు మందులిచ్చే డాక్టరను కున్నాను. తర్వాత తెలుసుకున్నానుకోండి మీరు సాహిత్యవైద్యులని'

తనవిటు కు తానే న వ్వు కు ం టున్న ఆయన్ను చూస్తే, మర్యాదకోసమైనా నవ్వాలనిపించలేదు డా. వేణుకు. 'మీపరిచయ భాగ్యమెప్పుడూ కలుగలేదు' అని మాత్రం అనగలిగాడు

'నన్ను దీక్షితులు అంటార్లెండి. తాత ముత్తాతల కాలంనుండి మాది పండిత వంశం జ్యోతిష శాస్త్రానికి పెట్టింది పేరు మావంశం.'

'చాలా సంతోషం. ఇందాకట్నుంచి అక్కడ కూర్చొని వ్రాసుకుంటున్నది మీరే గదూ?'

'వ్రాతకాదండీ. లెక్కలు కట్టడం. ఏం చెప్తాం చె ప్పం డి. ఈ గహాలున్నాయి చూశారూ నన్ను లాక్కువచ్చి ఇక్కడ కట్టి పడేశాయంటె నమ్మండి.'

డా. వేణు అర్ధంకానట్లు చూశాడు.

'అదేనండి మా యింటావిడ ఈరోజు ఉదయం లగాయతూ ప్రసవవేదన పడు తోంది. ఇంతవరకు పురుడు రాలేదు. పుట్ట బోయేది వంశోద్ధారకుడు కదా...'

'అంత నమ్మకంగా చెప్తున్నారు. జోస్యం చూసుకున్నారా?'

జోస్యం.. జోస్యలు... అవును ఆయన కూడా ఇంతే...

ఆలోచనల్లోకి జారుకోబోతున్న డా. వేణును దీక్షితులుగారి నవ్వు ఆపేసింది.

'ఈమాత్రం దానికి జోస్యం చూడాల టండి. మాతాత ముత్తాతల కాలంనుండి మాయింట్లో మొదటికాన్పు మగబిడ్డే. ఇప్పుడూ అంతే.'

'అనవాయితీ అంటారు...'

'ఆఁ అవునా, ఆ పుట్టబోయే వంశో ద్ధారకుడు తెల్లవారేలోగా పుట్టాలి.'

'ఎందుకని?'

'అలా అడగండి చెప్తాను. తెల్లవారితే గ్రహస్థితి మారుతుంది. పైగా రేపు సూర్యగ్రహణం కూడా గనుక సూర్యో దయానంతరం జననమొందే జాతకులు నానావిధ కష్టనష్టా లనుభవించడమే గాకుండా, తమ వంశానికికూడా మాయని మచ్చను కల్గించుతారు. అందుకనే త్వరగా పురుడు వ చ్చే ం దు కు ఇంజక్షన్లూ మందులూ ఇప్పించాలని హాస్పిటల్లో చేర్పించాను.'

డా వేణు ఆశ్చర్యంగా చూశాడు. అతను నమ్మలేకుండా ఉన్నాడు. షుమారు యాభై సంవత్సరాలకు పూర్వం .. ఇదే సమస్య... ఇదే సంఘటన ... అవును జోస్యులు తిరిగి జన్మించాడా? హిస్టరీ రిపీట్స్?

మెటర్నిటీవార్డు...లోపలి హాల్లో నుంచి కలగా పులగమైన మాటలు, ఏడ్పులాంటి స్వనాలు, స్ప్రింగ్‌డోర్‌ను త్రోసినప్పుడు వచ్చే కీచు ధ్వని.

'బాబూ, వేణూ ..' డాక్టర్ వేణు ముందుకు నడిచాడు ఏమిటమ్మా' అమ్మ ఏం చెప్తుందోనని భయం, ఆవేదన ...

'డాక్టరు ఇప్పుడే పరిక్ష చేసి వెళ్ళింది. తెల్లవారే వరకు పురుడు రాదంది. నీవు యింటికి వెళ్ళి...'

ఆ తర్వాతి మాటలు వేణుకి వినిపించ లేదు. ప్రపంచం తల్లక్రిందులౌతుందా... గిరిగిరా తిరుగుతుందేం? తెల్లవారే వరకు... సూర్యోదయం... జోస్యులు... శారదాంబ... పిచ్చి... తనకు పిచ్చెక్కుతోంది.

ఏదో వెన్నంటి తరుముతున్నట్లుగా బయటికి నడిచాడు డాక్టర్ వేణు. దీక్షి తులు...ఎవరీయన? పనిగట్టుకుని తనను పలుకరించి తన మనసు కల్లోల పరిచాడే. తరతరాలుగ పండిత వంశమట ఆయనిది, మరి ఆయనకు కలుగబోయే సంతానం— వంశోద్ధారకుడు – పండితుడు కాడా? ఆ వంశోద్ధారకుడు సూర్యగ్రహణ సమయంలో పుట్టి అపండితుడవ్వాలని నిర్ణయింపబడి వుంటే ఇంజక్షన్లూ, మందులతో ఆ నిర్ణ యాన్ని తప్పించగలడా ఈయన? అయితే తన సంగతేమిటి? శారదకు తెల్లవారే వరకు పురుడు రాదుట. మరి...తన అను మానాలు నిజం కావలసిందేనా? తనకీ మాన సిక క్షోభ తప్పదా? అమ్మా...నేరక అది గానే అనుకో...ఎన్నాళ్ళుగానో నీలో నిక్షిప్తం చేసుకున్న చేదు నిజాల్ని నాకెందుకు చెప్పా వమ్మా. నీవు చెప్పిన ఒక్కొక్కమాట నా నిశ్చల మానస సరోవరంలో ఒక్కొక్క తుఫాన్ను సృష్టించిందమ్మా...

* * *

'ఇదుగోనమ్మా నీవు పడిన శ్రమకు ప్రతిఫలం, నీ కలల పంట యూనివర్సిటీ వాళ్ళు నీ కొడుక్కు డాక్టరేట్ బిరుదు నిచ్చారమ్మా' అంటూ అప్పుడే పోష్టులో వచ్చిన కవరును సీతమ్మ కందించి ఆమె పాదాలకు నమస్కరించాడు వేణు.

సీతమ్మ చిరునవ్వుతో తన ఆనందాన్ని వెలిబుచ్చిందేగాని అంతకంటె తొణకలేదు. ఆమె ఎంతో ఆనందిస్తుంది, తనని పొగుడుతుంది అనుకున్న వేణు ఆమె ప్రవర్తనకు చిన్నబుచ్చుకున్నాడు. కొడుకు మనస్సును గ్రహించలేనిది కాదు సీతమ్మ, అందుకే అన్నది. నీవు చెప్పింది సంతోష కరమైన వార్తేగాని ఆశ్చర్యకరమైన వార్త కాదు వేణూ. ఏ పరీక్ష అయినా నీవు ప్యాస్‌కాక పోవడమంటూ ఎప్పుడూ ఉండ దని నాకేనాడో తెలుసు. నీకా మేధా సంపత్తి ఉంది. గుణగణాల్లో నీది మీ తాతగారి పోలిక'

'మా తాతగారేం చేసే వారమ్మా'

'ఆయ్యన అసలు పేరేమిటో తెలీదుగాని

ఆయన్ను అందరూ 'జోస్యులుగారు' అని పిల్చేవారుట. మన ప్రాంతానికి పేరు మోసిన జ్యోతిశ్శాస్త్రవేత్త ఆయన. ఆనాటి సంస్థానాధీశులెందరో ఆయన చేత జ్యోతిషం చెప్పించుకునేవారు. ఆయన చెప్పింది ఏనాడూ పొల్లుపోలేదు. ఒకసారి ఏం జరిగిందో తెలుసా? జ్యోతిశ్శాస్త్రంలో మీ తాతగారి ప్రజ్ఞను పరీక్షించాలని ఒక వ్యక్తి చిన్నతనంలోనే చనిపోయిన తన కుమారుని జాతక చక్రం తీసుకవచ్చి ఆ జాతకునికి సంతాన యోగం ఉందోలేదో చెప్పమన్నాడుట. మీ తాతగారు ఆ జాతక చక్రాన్ని పరిశీలించి 'ఈ జాతకునికి వివాహానికి పూర్వమే మరణ గండమున్నట్లు కన్పిస్తోంది. అతనిప్పుడు సజీవుడు కాడేమో' అన్నారుట. అంతటి గొప్ప వారాయన. అయితే మాత్రం ప్రయోజనమేముంది విధి వ్రాతలను తప్పించుకోలేక పోయారు.'

'అసలేం జరిగింది'

'ఆ వివరాలు తర్వాత చెప్తాలే బాబూ'

విషయాన్ని దాటేస్తోందని గ్రహించాడు వేణు 'ఇంకా ఎప్పుడమ్మా చెప్పేది. నేను పుట్టే వరకు నీకు అక్షర జ్ఞానం లేదంటివి. స్వయం శక్తిపై చదువుకుని చిన్న పిల్లలకు ట్యూషన్లు చెప్పుకుని నన్ను పెంచానంటివి. మా తాతగారిలా మహా మేధావి వవుతావని ఎన్నోసార్లు అంటివి. అంతకుమించిన వివరాలు ఎప్పుడడిగినా తర్వాత చెప్తానని వాయిదా వేస్తుంటివి ముఖ్యంగా నాన్నగార్ని గురించి'

ఆమె కొన్ని నిముషాలు మౌనంగా వుండి ఒక నిశ్చయానికి వచ్చి చెప్పసాగింది. 'మీ తాతగారు జ్యోతిశ్శాస్త్ర ప్రవీణుడని చెప్పాను కదూ. ఆయన తనకు పుట్టబోయే కుమారుని భవిష్యత్తును చదవాలని భార్య నొప్పులు పడుతున్నప్పుడే లెక్కలు కట్టుకుంటూ కూర్చున్నాడు. మీ తండ్రి గారు పుట్టిన సమయం వినడంతోటే చేతిలోని పుస్తకాన్ని అవతలపారేసి 'నా కడుపున చెడబుట్టాడుగదే ఈ పిచ్చి వాడు.' అంటూ ఒక్కసారి కన్నకొడుకు మొహమైనా చూడకుండా ఊరు విడచి వెళ్ళిపోయారుట. మహాపండితుడని పేరు గాంచిన తనకు అక్షరజ్ఞాన ముండని ఒక పిచ్చివాడు జన్మించినందుకు ఆయన ఎంత కృంగిపోయారో పాపం! పండిత పుత్రుడని

# టాస్

తన కుమారుని లోకం గేలిచేస్తుందని ఊహించి ఆ అవమానాన్ని భరించే ధైర్యం లేక అలా వెళ్ళి పోయాడాయన. అప్పటి నుండి మీ నాయనమ్మ — ఆవిడ పేరు శారదాంబ—మీ నాన్నగారిని పెంచేందుకు ఎన్నో అవస్థలు పడింది. ఆ ఏటికాయేడు వయస్సుపై బడుతున్నా, మానసికంగా మాత్రం ఏమీ ఎదగకుండా పెరిగారు మీ నాన్నగారు.'

'అయితే నాన్నగారు పిచ్చివారా?'

'అవును బాబూ అదొక తరహా పిచ్చి... మనిషిని గుర్తుపట్టగలడు. మాట ను అర్థం చేసుకోగలడు. అయితే మనసులోని భావాన్ని మాటల ద్వారా వెలిబుచ్చలేడు. అలాగని మూగవాడూ కాదు. తనకేదైనా కావలసి వచ్చినపుడు పిచ్చికేకలు పెడతాడు. పక్కనున్న వారిని కొడతాడు, ఱక్కుతాడు. ఆయనకు కావలసినదేదో గ్రహించి దానిని సమకూర్చితే మరేమి అల్లరి చేయకుండా కూర్చుంటాడు. అలాంటి కొడుకును

## ఓం నమః శివాయ

కం. భలేవాడివే విశ్వేశా
భారవాలేక క్రోధమూ మరయకుంటిన్
భిక్కు భిక్కని బెదరెదన్
భీకర బెదరింపులకు తలవంపను విశ్వేశా.

కం. భుక్తి ముక్తి దాయకుడవన్న
భూమిలో ప్రజలకెల్ల బుద్ధి ప్రసాదింపన్న
భృగు సంహిత చదువు దన్న
భూగ్రహ కారాగ్రహ మెరుగని మూర్ఖున్

కం. భే నెట్లు రూపకల్పననిత్తు
భేదించి, సాధించి, శివునిధ్యానించి
సాహసించెదన్
భైరవుని భక్తి రక్షించున్
భొక్కి, చిక్కి, చింతించి, చలించి
చింతాక్రాంతనైతిన్.

కం. భోరుమని రోదించనన్న
భా భో మని అరువ, ఆర్భాటించ
అమృత లింగా
భండగాను, బ్రాహ్మణిని
బహిర్గత మొనరించితి త్రినేత్రునితో
తర్కించితిన్.

—రచయిత్రి: శ్రీమతి సరస్వతి గిరి

కంటికి రెప్పలా కాపాడుకుంటూ భర్త వెళ్ళిపోయిన దుఃఖాన్ని మరిచిపో ప్రయత్నించింది శారదాంబ. జరుగుబాటుకు వెదుక్కోనవసరం లేని కుటుంబం కాబట్టి సరిపోయింది గాని లేకపోతే మరెన్ని బాధలు పడవలసి వచ్చేదో'

'అయితే అలాంటి పిచ్చివాడిని నీవు పెళ్ళెందుకు చేసుకున్నావమ్మా. ఇప్పుడు నాన్న, బామ్మ ఎక్కడున్నారు. కలిగిన కుటుంబానికి కోడలివైన నీవు వంటరి దానవై, పాఠాలు చెప్పుకుంటూ బ్రతుకును భారం చేసుకోవలసిన అవసరం ఎందుకు వచ్చింది?'

సీతమ్మ వెంటనే జవాబు చెప్పలేదు. దుఃఖం పెల్లుబికి ఏడ్వటం మొదలెట్టిందామె. ఆమెను ఎలా ఓదార్చాలో అర్థం కాలేదు వేణుకి.

'ఎందుకమ్మా ఏడుస్తావు. భూదేవిని మించిన ఓర్పుతో ఇన్నాళ్ళూ కష్టాన్ని భరించావు. అవమానాల్ని సహించావు. కన్న కొడుకును అపురూపంగా పెంచి పెద్ద వాడ్ని చేశావు. విద్యాబుద్ధులు చెప్పించావు. నీ మంచితనం పట్టుదల ప్రభుత్వంవారి స్కాలర్ షిప్పుల రూపంలో నన్ను మేధావిని చేయాలనే నీ ప్రయత్నానికి చేయూతనిచ్చాయి. నీ కృషి ఫలించి కలలు పండే శుభదినం రాబోతుందికదా ఎంకా నీకు విచారమెందుకమ్మా, గతాన్ని కథలా చెప్పుకుని నవ్వుకోవాలిగాని'

'అవును నాయనా అలాగే చేస్తాను. ఇన్నాళ్ళూ నీకు తెలియకుండా గుండె గూడులో దాచుకున్న నాకథను బాధ చెప్తాను విను...నేను నా పన్నెండో ఏట శారదాంబ గారింట్లో పనిమనిషిగా చేరాను. నాకు ఊహా తెలియకముందే తల్లి చనిపోయింది. కూలీనాలి చేసుకునే తండ్రి రోజూ తాగి తందానా లాడేవాడు. ఇరుగుపొరుగులే కనికరించి పెంచారు నన్ను. పదేళ్ళ వయసు దగ్గర్నుంచి పనిపాటలు చేసుకుని బ్రతుకు తెరువు చూసుకోమని సలహా ఇచ్చారు ఇరుగుపొరుగులు ... కొత్తగా పనిలో చేరిన నన్ను ఆ యింట్లోని తూర్పుగదిలో ఇనుప చువ్వల కిటికీ అవతలనుంచి ఒక వ్యక్తి ఆసక్తిగా చూడటం గమనించాను. శారదాంబ గారికి ఇంటిపనుల్లో సాయపడే నాకు క్రమేణా ఆ వ్యక్తికి అన్నపానాలు అందించే




# ఉతికే బిళ్ల
# డిటర్జెంట్ శక్తితో నిండినది
















## డెట్ డిటర్జెంట్ ఉతికే బిళ్ల

సబ్బు కంటె 50%
ఎక్కువ బట్టలను ఎక్కువ
తెల్లగా ఉతుకుతుంది
—మంచి నీళ్లు లేక ఉప్పు నీళ్లతో

Ek (p) HPMA-43/70 TL

బాధ్యత వప్పగించబడింది. అతను దాని కోపమో మారాము చెస్తున్నప్పుడు అతన్ని లాలించి, బుజ్జగించి సమాధాన పరచడంలో నేనుకూడ ఒక విధమైన తృప్తి అనుభవించేదాన్ని. పదహారేళ్ల వయసువచ్చినా పసివాని మనస్తత్వంవోని అతనికి సేవచేయటంలోనే నాకు ఆనందం లభించేది. అలా మరో ఆరేళ్లు గడిచాయి. ఒకరోజు అతను—అతన్ని 'బుజ్జి' అని పిలిచేది శారదాంబ—అతను ఆరోజు ఉదయంనుండి ఒకటే కేకలుపెడ్తూ తన గదిలో పిచ్చిగా గంతులు వేయటం మొదలెట్టాడు. తలుపులు తీసికొని పారిపోదామని ప్రయత్నించాడు. ఆ ప్రయత్నం నుండి విరమింప చేసేసరికి మా తల్ప్రాణం తోకకొచ్చింది. కాని అతను గోలమాత్రం మానలేదు. వెకిలినవ్వులు వెర్రిరాగాలాపన చెవులు గింగురుమనే పిచ్చి కేకలతో ఆ వీధంతా మార్మ్రోగిపోయింది. ఆరోజు రాత్రి శారదాంబగారు నన్ను దగ్గరకుపిలిచి 'నాకోసహాయం చేస్తావా సీతా' అని అడిగింది. ఏమిటన్నాను 'చేస్తావని మాటఇస్తేనే చెప్తా' నంది. పొట్టకూటికి వాళ్ళపంచన చేరినదానను వాళ్లు ఆజ్ఞాపిస్తే ఏమైనా చేయాలి. అలాంటిది ఏదో సహాయం అర్థిస్తుంటే కాదనడం ఎలా? అలాగే నన్నాను. అప్పుడామె చెప్పింది. 'ఒకరిద్దరు వైద్యుల్ని కనుక్కున్నాను సీతా! అబ్బాయికి కొంత ఉపశమనం కలగాలంటే ఇదొక్కటేదారి. నీవు చేయవలసిందల్లా ఒక్కటే' అంటూ నాచెవిలో ఏదో చెప్పింది, నేను నివ్వెరపోయాను. నోటమాట పెగల్లేదు. శీలము సేవాపరాయణత ఈరెంటిమధ్య సంఘర్షణ ప్రారంభమైంది మనసులో. నాలోని స్త్రీ ఓడిపోయింది. నాలోని పరిచారిక చెప్పిన మాట విన్నది అంతే...నా లో ని వివేకం మేల్కొని జరిగిన అన్యాయం గుర్తించేసరికి గుండె చెరువైంది. మనసు వికలమైపోయి వూరువిడిచి వచ్చేశాను. జరిగిన అన్యాయం శాశ్వతమైన రూపుదాల్చుకొని నాలో పెరుగుతున్నదని తెలుసుకున్నప్పుడు నా మనసులో మరోభయం తావేర్పరచుకుంది. నాలో పెరుగుతున్న శిశువు ఒక పిచ్చివాని కామ కలాపానికి ప్రతిరూపం. ఆ శిశువు తండ్రి మానసిక రుగ్మతకు వా ర సు డౌ తే? ఆ పిచ్చి సంతానంతో జీ వి తాం త ం తను ఎలా వేగాలి? 'వద్దు, నేను భరించలేను. ఈ పిచ్చి వారసత్వానికి నా జీవితానికీ అంతం కలిగించాల'ని ఆత్మహత్య చేసుకుందామనుకున్నాను. కాని తల్లిని కావాలనే స్త్రీ సహజమైన వాంఛ నా ప్రయత్నాన్ని కొనసాగనీయలేదు. అదీగాక శారదాంబగారి ద్వారా నేను విన్న మీ తాతగారి వృత్తాంతం నాలో ఆశను కల్పించింది. మీ తాతగారిలాంటి మేధావికి పిచ్చివాడు జన్మించాడు. ఆ పిచ్చివానికి మరో మేధావి ఎందుకు వారసుడు కాకూడదు? మనిషి ఆశాజీవి క ను క వెలుగు వైపే ప్రయాణించదలచుకున్నాను. అతర్వాత కథ నీకు తెలిసిందే.




తల్లి నోటి నుండి విసిన ఈ కథను పదే పదే మననం చేసుకున్నాడు వేణు.

కన్నకొడుకు మొహమైనా చూడకుండా దేశాల వెంట వెళ్లిపోయిన తాతగారంటె అసహ్యం కలిగింది...పిచ్చివాడు ఏదో అరుస్తున్నాడులెమ్మని సరిపెట్టుకోకుండా, సాటి స్త్రీ కన్నె జీవితాన్ని బలిపెట్టడానికి వెనుకాడని శారదాంబగారంటే జుగుప్స కలిగింది. పర్యవసానం వూహించకుండా ఎవరి కోసమో తన జీవితాన్ని చేజేతులా పాడుచేసుకున్న తల్లిమీద కోపమొచ్చింది. అవును వీళ్ళంతా పిచ్చివాళ్ళు. ఈ పిచ్చివాళ్ళంతా కలిసి నన్ను పిచ్చివాణ్ణి చేశారు...

వేణుకి తండ్రిని చూడాలనే కోర్కె బలీయమై, ఒకసారి ఆ వూరు వెళ్ళి, వారి ఆచూకి తెలియక తిరిగి వచ్చాడు. అతనికి మనసులో అసంతృప్తి ఎక్కువైంది. తన జీవితంలో ఏదో లోటు కొట్టవచ్చినట్లు కన్పిస్తోంది. అది 'కన్న తండ్రిని చూడలేకపోయాననేనా ?' ఆ లోటును మర్చిపోదామని ఎన్నో వ్యాపకాలను పెంచుకున్నాడు. అయినా, ఏదో రూపంలో అది అతన్ని వెక్కిరించేది.

తనకు తాతగారి పోలిక వచ్చిందని అమ్మ ఎన్నోసార్లు అనేది. అప్పుడు అతను గర్వంగా వూపిరి పీల్చుకునేవాడు. కాని ఇప్పుడో?... ఆ తాతగారిలా తనకూ పిచ్చివాడు వారసుడౌతాడేమోననే భయం.

కాబోయే భార్యపేరు 'శారద' అని తెలుసుకున్నప్పుడు అందమైన ఆ పేరును ఎన్నోసార్లు లోలోన ఉచ్చరించుకున్నాడానాడు. వివాహమై, గ తం క థ ల్ని విన్న తర్వాత ఇప్పుడు భార్యను పేరుతో పిలవాలంటేనే భయంగా వుంది, శారదాంబ కళ్ళముందు నిల్చి గతాన్ని పైకి తోడుతుందని.

'ఏవండీ, మనకు పుట్టబోయే పాపను ఏమని పిలుద్దామండీ' శారద ప్రేమగా అడిగిందోరోజు. 'అబ్బాయో, అమ్మాయో తెలీకుండా పేరెలా పెట్టడం'

'పేరు సంగతి కాదండీ, ముద్దుపేరు'

'నీ యిష్టం'

'బుజ్జీ అని పిలుద్దామండి. నాకలా పిలవాలంటే ఇష్టం'

భార్య మాటలకు వేణు గతుక్కుమన్నాడు, తండ్రి జ్ఞాపక మొచ్చి. మర్చి

పోదామనుకున్న విషయాలు మరుపురాక పోవడం మానవాళికి శాపమేమో!

* * *

ఇల్లు చేరి ఏమీ తోచక కూర్చున్నాడు డా. వేణు. కాలం గడియారం ముళ్ళ రూపంలో ముందుకు జరుగుతూనే వుంది. జరిగిన దానికి, జరుగనున్న దానికి వారధిలా వర్తమానం నిశ్చలంగా అగుపిస్తుంది. క్షణం తర్వాత అది 'తంలో కలసి పోతుంది ... మరికొన్ని గంటల్లో తను తండ్రి కాబోతున్నాడు. మొదటిసారిగా తండ్రిగాబోతున్న ఎవరికైనా ఆనందంగానే వుంటుంది. తన రక్తాన్ని పంచుకుని, తన వంశాన్ని నిలబెట్టే నోముల ఫలం. ప్రేమలపంట సంతానం. అట్టి సంతానాన్ని ఎప్పుడెప్పుడు చూద్దామా అని అందరూ తహ తహ లాడడం సహజమే. కాని తన కెందుకో భయంగావుంది. తాతపోలికవచ్చి నేను మేధావినే అయ్యాను. అలాగే తన సంతానానికికూడా వాళ్లతాత పోలికవస్తే?

తెల్లవారితేగాని పురుడు రాదుట...'

'సూర్యోదయమైతే గ్రహణ కాలం...'

'అబ్బ! అక్కడ శారద ప్రసవవేదనను ఎలా భరిస్తోందో కాని ఇక్కడ నేను మానసిక వేదనను భరించలేకుండా ఉన్నాను భగవాన్' అనుకుంటూ తలపట్టుకున్నాడు డా. వేణు.

ఆనాడు తన తాతగారు పుట్టిన పురిటి కందుమొహం కూడా చూడకుండా ఎందుకు దేశాటనం వెళ్ళాడో, అప్పటి ఆయన మానసికస్థితి ఎలాంటిదో అర్థమైంది వేణుకు.

'త్వరగా పురుడువచ్చేందుకు ఇంజక్షన్లూ, మందులూ ఇప్పించాలని...' దీక్షితులుగారి మాటలు డా. వేణుకు కర్తవ్యబోధ చేసి నట్లు జ్ఞాపకమొచ్చాయి.

'అవును, నేనూ అలా ఎందుకు చేయ కూడదు? తాతలనాటి కాలం కాదిది. సైన్సు బహుముఖంగా విస్తరిల్లి, ఊహించరాని విజయాలను మానవాళికి అందిస్తున్న రోజులివి. హృదయాలను మార్పిడీచేసే మానవుడికి సాధ్యంకాని దేముంది? గ్రహణానికిముందే పురుడు వచ్చేలాచేస్తే జాతకుని గ్రహస్థితి బాగుండ వచ్చేమో···మేధావికి, పిచ్చివానికి అట్టే తేడా లేదుగదా! వారిద్దరూ ఒకేనాణేని కుండే రెండుప్రక్కలు. నాణేన్ని ఎగుర వేస్తే బొమ్మా పడొచ్చు, బొరుసూ పడొచ్చు. ఏదైందీ ఇదమిద్ధమని ఏ జ్యోతిష్యమూ చెప్పలేదు. చెప్పగలిగినా జరుగనున్న అవాంఛితాన్ని తాలిమితో ఎదుర్కొనే స్థైర్యం ఎందరి కుంటుంది? దురదృష్టవశాత్తూ తన సంతానం పిచ్చివాడేఅయినా, ఆధునిక శాస్త్రప్రగతి ద్వారా అతని మానసిక స్థితిని చక్కబరచవచ్చు. అనుకున్నాడు డా. వేణు.

అలా అనుకోగానే అతనికి కొండంత బరువు దించినట్లైంది. టైం చూసు కున్నాడు. పన్నెండు కావచ్చింది. ఒక అరగంటలో హాస్పిటలుకు వెళ్దామను కున్నాడు. క్షణంసేపు అలా విశ్రాంతిగా పడుకున్నాడు. అతనికి తెలియకుండానే నిద్ర పట్టింది...

మెళుకువవచ్చి చూసేసరికి ఆరైంది. కంగారుగా లేచి హాస్పిటల్‌కు బయలు దేరాడు డా. వేణు.

దీక్షితులుగారు దిగాలుగా ఎదురు వచ్చాడు. వేణును చూస్తూనే అన్నాడు: 'భగవంతుడు నన్ను అన్యాయం చేశాడు డాక్టర్‌గారూ! సూర్యోదయానికి ముందే పురుడైతే వచ్చింది కాని, పుట్టింది అడ పిల్ల. మా వంశంలోని ఆనవాయితీని తారుమారు చేసింది' అంటూ వెళ్తున్న దీక్షితులుగారి వైపు సానుభూతిగా చూశాడు డా. వేణు.

ఇంతలో నర్సువచ్చి వేణువైపు ముసి ముసి నవ్వులతో చూస్తూ అన్నది. 'మీకోసం మీబాబు రెండు గంటల్నుంచి ఎదురు చూస్తున్నాడు. ఆరో నెంబరు రూంకు వెళ్ళండి.'

'థాంక్యూ సిస్టర్. ఒక చిన్నమాట బాబు ఎలా ఉన్నాడు?'

'వెళ్ళి చూడండి'

'అదికాదు సిస్టర్ బాబు మానసికంగాను శారీరకంగాను ఆరోగ్యంగా ఉన్నాడా?'

'పర్‌ఫెక్ట్లీ ఆల్‌రైట్' అంటూ వెళ్ళి పోయిందామె. ఆ తర్వాత...

మూడేళ్ళ బుజ్జి ముద్దు మాటలు వింటూ ఆ వయస్సులో వాని తెలివి తేటలకు అబ్బురపడుతూ అనుకున్నాడు డా. వేణు. 'మా తాత మళ్ళీపుట్టాడు, థాంక్యూగాడ్.'

# 1972లో మీ రాశిఫలం

## కుంభం

ప్రతి సంవత్సరం జనవరి 21వ తేదీ నుంచి ఫిబ్రవరి 19వ తేదీ వరకు సాయనసూర్యుడు కుంభరాశి యందు ఉంటాడు కాబట్టి యీ తేదీల మధ్యను జన్మించిన వారు కుంభరాశి యందు జన్మించిన వారుగా పరిగణింపబడుతున్నారు. జనన సమయంతో కాని నక్షత్రంతో కాని దీనికి నిమిత్తం లేదు.

1, 4, 10, 13, 19, 22, 28, 31 తేదీలలో జన్మించిన వారికి యీ సంవత్సరం చాలా బాగుంటుంది.

విద్యార్థులు మంచిమార్కులతో కృతార్థులు కావచ్చును.

**జనవరి**

వృత్తి వ్యాపారాల్లో ఆదాయవ్యయాలు రెండూ కూడా పెరుగుతాయి. ప్రయాణాల్లో ప్రయాస కలుగుతుంది. మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది. ఉద్యోగంలో మీ పరిస్థితి సామాన్యంగా ఉంటుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో జోక్యం చేసికోవడం తగదు. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది.

**ఫిబ్రవరి**

వ్యాపారంల్లో పోటీవారి పోటీ తగ్గుతుంది. కొన్ని వ్యవహారాల్లో యితరుల మూలంగా మీరు యిబ్బందికి గురి కాగలరు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు శ్రమ మీద నెరవేరతాయి. ఆరోగ్యం బాగా ఉండదు. సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వినోద కాలక్షేపాలలో పాల్గొంటారు. ప్రయాణాలు లాభదాయకంగా ఉంటాయి.

**మార్చి**

వృత్తిలో ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. వ్యాపార విస్తరణ ప్రయత్నాల్లో ఆటంకాలు యేర్పడతాయి. ఇతరుల వలన యే సహాయమూ ఆశించడాని అవకాశం లేదు. ఉద్యోగంలో మీ కృషిని అధికారులు గుర్తించగలరు. కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. విలాస వస్తువులు కొంటారు. అనవసరమైన సందేహాలు కలుగుతాయి.

**ఏప్రిల్**

మీ నుంచితనమే కొన్ని వ్యవహారాల్లో మీకు యిబ్బందిని కలిగిస్తుంది. వృత్తి వ్యాపారాల్లో పోటీ వారి పోటీని యెదుర్కొని అభివృద్ధిని సాధించగలరు. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి కోర్టు వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి సంతోషకరమైన వార్తలను వింటారు. శుభకార్యాల విషయంలో స్వల్పాభివృద్ధిని సాధిస్తారు.

**మే**

ఈ నెలలో మీ కార్యక్రమాలు సులువుగా నెరవేరతాయి కాని ఫలితం మాత్రం సామాన్యంగా ఉంటుంది. భారీయెత్తున చేసే వ్యాపారాలు వాయిదా వేయడం మంచిది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. మీ ఆలోచనలు యితరులకు లాభదాయకంగా ఉంటాయి. స్థిరాస్థి వ్యవహారాల్లో చికాకులు యేర్పడవచ్చును. దైవకార్యాలు నెరవేరతాయి.

**జూన్**

వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. విద్యావైజ్ఞానికరంగాల , ఖ్యాతి లభిస్తుంది. ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి. బంధువుల నిమిత్తం శ్రమకు గురి కాగలరు. ఇప్పుడు చేసే ప్రయత్నాల వలన మున్ముందు కూడా ఉపయోగం ఉంటుంది.

**జూలై**

మీకు నష్టం కలిగించడానికి యితరులు చేసే ప్రయత్నాలే మీకు అనుకూలంగా మారగలవు. సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి రాగలదు. వృత్తి రీత్యా చేసే ప్రయాణాలు ఫలిస్తాయి. ఉద్యోగంలో మీరు యిదివరకు చేసిన నిర్ణయాలు సరియైనవని రుజువు కాగలవు. ప్రయోజనగల పరిచయాలు యేర్పడతాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**ఆగస్టు**

సామాన్యమైన పనులకు కూడా మీరు యెంతో కృషి చేయవలసి వస్తుంది. వృత్తిలో కొత్తవారితో పోటీ యేర్పడుతుంది. వ్యాపారంలో కొంతమంది వ్యక్తులు మీ మీద నిందా ప్రచారం చేయవచ్చును. ఉద్యోగంలో మీ పరిస్థితి బాగా ఉంటుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది.

**సెప్టెంబరు**

ఈ నెలలో కొన్ని పనులు సులువుగా నెరవేరినా, మరికొన్నింటిలో శ్రమ కలుగుతుంది. వ్యాపారంలో అనుకోని చికాకులు కలగవచ్చును. వృత్తి రీత్యా చేసే ప్రయాణాల్లో శ్రమకు గురి కాగలరు. ఏ వ్యవహారంలోను యితరుల మీద విశేషంగా ఆధారపడడం తగదు. కుటుంబ వ్యవహారాల్లో భేదాభిప్రాయాలు యేర్పడి తరువాత సర్దుకొంటాయి.

**అక్టోబరు**

మీకు మున్ముందు లాభించగల వ్యవహారాల్లో ఓరవ చూపించవలసిన సమయం. వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరతాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. విలాస వస్తువులు కొంటారు. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. ఆరోగ్యం బాగుంటుంది ప్రయాణాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి మిత్రులకు సహాయం చేస్తారు.

**నవంబరు**

అన్ని వ్యవహారాల్లోను గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి. మీ కంటే పెద్దవారు కూడా కొన్ని వ్యవహారాల్లో మీ సహకారాన్ని కోరవలసి వస్తుంది. వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు లాభదాయకంగా ఉంటాయి. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. సాంఘిక కార్యక్రమాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. పుణ్యకార్యాలు చేస్తారు. శుభకార్యాల విషయంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి.

**డిసెంబరు**

వృత్తి వ్యాపారాల్లో మీ ఆలోచనలకు తగిన అవకాశాలు లభిస్తాయి. ఇదివరకు చేజారిపోయిన అవకాశాలు కూడా తిరిగి లభింగలవు ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది సాహసముతో కూడిన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు. ఇతరుల మూలంగా మిత్రులతో భేదాభిప్రాయాలు రావచ్చును. ఆరోగ్యం బాగుంటుంది.

## మీనం

ప్రతి సంవత్సరం ఫిబ్రవరి 28వ తేదీనుంచి మార్చి 21వ తేదీ వరకు సాయన సూర్యుడు మీనరాశియందు ఉంటాడు కాబట్టి యీ తేదీల మధ్యను జన్మించినవారు మీనరాశియందు జన్మించిన వారుగా పరిగణింప బడుతున్నారు. జనన సమయంతో కాని నక్షత్రంతో కాని దీనికి నిమిత్తం లేదు.

1, 4, 10, 13, 19, 22, 28 తేదీల్లో జన్మించిన వారికి యీ సంవత్సరం చాలా బాగుంటుంది.

విద్యార్థులు సామాన్యంగా కృతార్థులు కాగలరు

**జనవరి**

వృత్తిలో మిత్రుల వ్యవహారాల్లో జోక్యం చేసికోవలసి వస్తుంది. ప్రయాణాలు శ్రమమీద ఫలిస్తాయి. సమయానికి యేదో ఒక విధంగ డబ్బు చేతికి రాగలదు. నూతన విషయాలను తెల్సుకొంటారు. ఉద్యోగంలో అపోహలకు గురికాగల ప్రమాదం ఉంది. ఆరోగ్యం బాగా ఉంటుంది. అన్ని వ్యవహారాల్లోను బాగా దూరదృష్టితో ప్రవర్తించడం అవసరం.

**ఫిబ్రవరి**

సహాయం చేస్తామన్నవారు సమయానికి తప్పుకోవచ్చును. వృత్తివ్యాపారాల్లో మీరు శ్రమపడినా, ఫలితం దక్కదు. సాహసముతో కూడిన వ్యవహారాల్లో జోక్యం చేసికోవడం తగదు. మీ తాలూకు వస్తువులు పోవచ్చును. సాహిత్య కళారంగాల్లో మీ కృషికి ఆటంకాలు వస్తాయి. ఆరోగ్యం విషయంలో జాగ్రత్త అవసరం. పుణ్యకార్యాలు చేస్తారు.

**మార్చి**

ఈ నెలలో క్రమంగా అనుకూల పరిస్థితులు

యేర్పడతాయి. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు లాభిస్తాయి. ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి. విలాస వస్తువులు కొంటారు. ఉద్యోగంలో అనుకూలత లభిస్తుంది. ఆరోగ్యం యిది వరకటి కంటే బాగా ఉంటుంది. బంధుమిత్రులను కలసి కొంటారు. మీ ఆలోచనలు ఫలిస్తాయి.

**ఏప్రిల్**

వ్యాపారంలో ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. ఆర్థిక వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. కుటుంబ సంతోషం లభిస్తుంది. కొన్ని వ్యవహారాల్లో యితరుల మూలంగా మీరు శ్రమకు గురి కావలసి వస్తుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది

**మే**

వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది ఉద్యోగంలో మీ ఆలోచనలకు తగిన అవకాశాలు లభిస్తాయి. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి మిత్రులకు సహాయం చేస్తారు. ఆరోగ్యం బాగుంటుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది అనవసరమైన చర్చలకు దిగి కాలాన్ని వ్యర్థం చేసికొనే ప్రమాదం ఉంది.

**జూన్**

రావలసిన డబ్బు మీద ఆధారపడి యితరులకు వాగ్దానాలు చేయడం తగదు. వృత్తి వ్యాపారాల్లో సాటివారి పోటీ పెరుగుతుంది ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది స్థిరాస్తి వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. బంధుమిత్రులను కలసి కొంటారు కొన్ని వ్యవహారాల్లో మొగమాటాలకు లొంగిపోవడం వలన ప్రయోజనం లేని శ్రమకు గురి కాగలరు.

**జూలై**

వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు అనుకొన్నట్లుగా నెరవేరతాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది స్థిరాస్తి వ్యవహారాల్లో చికాకులు యేర్పడవచ్చును విలాస వస్తువులు కొంటారు. ప్రతివ్యవహారంలో మీకు సందేహాలు కలుగుతాయి వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**ఆగస్టు**

భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. ఆర్థిక వ్యవహారాల్లో అనుకూలమైన వార్తలు వస్తాయి. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు శ్రమమీద ఫలిస్తాయి. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి ఇతరుల మూలంగా మీరు నిందలకు గురి కావలసి వస్తుంది.

**సెప్టెంబరు**

మీ ఆలోచనలు యితరులకు బాధదాయకంగా ఉంటాయి. వ్యాపారంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. వృత్తి రీత్యా చేసే ప్రయాణాలు శ్రమ మీద ఫలిస్తాయి సాటి వారిలో గౌరవం బాగుంటుంది. ఏ వ్యవహారంలోనూ తొందరపాటు తగదు. నూతన వ్యవహారాల్లో శ్రమ అధికంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది.

**అక్టోబరు**

మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకించ గలరు. వృత్తి వ్యాపారాల్లో ప్రయోజనం లేని శ్రమ కలుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో జోక్యం చేసికోవడం తగదు. ఉద్యోగంలో యితరుల మూలంగా యిబ్బందికి గురి కాగలరు. ఆరోగ్యం బాగా ఉండదు. సాటివారితో మాట పట్టింపులు రావచ్చును. వ్యతిరేకమైన వార్తలను వింటారు

**నవంబరు**

వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు యిదివరకటి కంటే బాగుంటాయి కాని యేదో ఒక కారణం వలన తరుచుగా మానసికాందోళన కలుగుతుంది. భారీ యెత్తున చేసే వ్యాపారాలు బాగుంటాయి. స్థిరాస్థి వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. డబ్బు యిచ్చి పుచ్చుకోవడాల్లో జాగ్రత్త అవసరం. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**డిసెంబరు**

మీకంటే పెద్దవారు కూడా మీ సహాయాన్ని కోరవలసి వస్తుంది. వృత్తి వ్యాపారాల్లో మీకు ముమ్ముందు ఉపయోగించగల వార్తలు వస్తాయి. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. సాంఘిక వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. దైవ కార్యాలు నెరవేరతాయి. మీ మంచితనమే కొన్ని వ్యవహారాల్లో అనుకూలతను సాధించగలదు.

--మహేష్ ●

రసవర్గాలూ - గుణాలూ :

# కరివేపాకు

పులిహోర, ఉప్మా, కొన్ని కూరలలోను, కొన్ని పిండి వంటలలోను కరివేపాకు వేస్తుంటారు. కరివేపాకు ఏ పదార్థంలో వేస్తే ఆ పదార్థాలకు మంచి సువాసన, రుచి వస్తుంది. కరివేపాకు గుండచేసి అన్నంలో కలుపుకొని కొంతమంది తింటూ ఉంటారు

కరివేపాకు కఫం, గ్రహణి, గుల్మం, మూలవ్యాధి, రక్తగ్రహణి దారుణమగు అతిసారం గలవారికి పథ్యమయినది

ఇది అరుచిని పోగొట్టి జఠరదీప్తి నిస్తుంది విషవాయుదోషాన్ని హరిస్తుంది. కరివేపాకు కషాయం వీర్యానికి వేడినిస్తుంది విరేచనకారి.

లేత ఆకుల్ని పాలతో ఉడికించి, మెత్తగా నూరి విషకీటకములు కుట్టినచోటవేసి కట్టుకడితే ఆ విషం హరించబడుతుంది.

కలరా వాంతులుగాని, యితర వాంతులు గాని అవుతున్నట్లయితే కరివేపాకుల రసాన్ని గాని, కషాయాన్నిగాని యివ్వండి. వాంతులు కడతాయి. రసం యొక్క మోతాదు సుమారు రెండు తులాల ఎత్తు. కషాయం మోతాదు 1 అవున్సు. రక్తగ్రహణి అవుతున్నట్లయితే ఆకులు పచ్చివిగాని, నేతిలో వేయించినవిగాని తగు మోతాదులో ఉదయం, సాయంత్రం నాలుగైదు దినాల పాటు తినండి. కడుతుంది. కరివేపాకు మిక్కిలి పథ్యమయినది.

# సునాముఖి ఆకు

కొంతమంది ఈ ఆకును గరమసాలా దినుసులలో చేర్చి వాడుతుంటారు.

ఇది వేడి చేస్తుంది. వాతాన్ని అణస్తుంది. మలబద్ధాన్ని పోగొట్టి సుఖవిరేచనం గావిస్తుంది.

తులంలో ఎనిమిదవ వంతు మొదలు పావుతులం వరకూ సునాముఖి ఆకుయొక్క చూర్ణాన్ని తేనెతో పుచ్చుకున్నట్లయితే ధాతుపుష్టి చేకూరుతుంది. పంచదారతో పుచ్చుకున్నట్లయితే వాతం నివారించబడుతుంది. బెల్లంతో పుచ్చుకుంటే జలుబు తగ్గుతుంది. నేతితో పుచ్చుకుంటే శరీరంలోని చాలా రుగ్మతలు నయమవుతాయి నెయ్యితో పుచ్చుకుంటే జ్ఞాపకశక్తి బాగా ఉంటుంది మేకపాలతో పుచ్చుకుంటే బలం చేకూరుతుంది ఇంద్రియం వృద్ధి అవుతుంది. ఆవుపాలతో పుచ్చుకుంటే శరీరానికి కళాకాంతులువస్తాయి. నువ్వులతో పుచ్చుకుంటే ధాతుపుష్టి చేకూరుతుంది నారికేళ జలంతో పుచ్చుకుంటే నోటి దుర్గంధం తగ్గుతుంది. గుంటకలగరాకు రసంతో పుచ్చుకుంటే తెల్లని వెంట్రుకలు నల్లబడతాయి ద్రాక్షపళ్ళరసంతో పుచ్చుకుంటే కళ్ళకు తేజస్సు వస్తుంది. ఉసిరికాయరసంతో పుచ్చుకుంటే అనేక రుగ్మతలు నివారణ మవుతాయి. నిమ్మకాయరసంతో పుచ్చుకుంటే కడుపునొప్పి తగ్గుతుంది.

దీని వంచదారతోగాని, పటిక పంచదారతోగాని సునాముఖి ఆకు చూర్ణాన్ని సమానంగా కలిపి ప్రాతకు తులం మొదలు అర తులం ఎత్తువరకూ దేహదారుఢ్యాన్నిబట్టి రెండు పూటలా కొన్ని దినాలు పుచ్చుకుంటే తల నొప్పి, క్షయదగ్గు, మేహవాతపు నొప్పులూ తగ్గుతాయి.

గ్రహణి, రక్తగ్రహణి గలవారికి సునాముఖి యివ్వకూడదు.

సేకరణ ఆకుండి నారాయణమూర్తి




### జరిగిన కథ

కాంతారావు పెళ్ళయిన దగ్గర్నుంచి హనీమూన్‌కి వెళ్ళాలనుకుంటున్నాడు. ఇద్దరు పిల్లలు కలిగినా అతని ఆశ తీరలేదు. అనుకోకుండా వచ్చిన డబ్బుతో పిల్లలతోసహా ప్రేమయాత్రకి బయల్దేరి తీరాలి అనుకున్నాడు. అతని కోరిక కళ్యాణిని మొదట్లో ఆశ్చర్యపరిచినా – ఆ ప్రయాణం ఆమెకీ ఆనందమే. బయల్దేరదామంటే బయల్దేరదామనుకున్నారు. రైల్లో ప్రయాణంచేసూ భార్యాభర్త లిద్దరూ ఆయాత్రలోని ఆనందాన్ని అనుభవించారు. వారి మొదటి మజిలీ తిరుపతిలో. తిరుపతిలో దైవ దర్శనాన్ని ముగించుకుని ఆకాశ గంగ వద్దకి వెళ్ళారు. అక్కడ కల్యాణి అన్న మాటలు కాంతారావుకి బాధ కల్గిస్తాయి. పాపనాశనం చూసుకుని ఆ కుటుంబం దిగువ తిరుపతికి వస్తారు. భార్యా భర్తలు ఇద్దరూ రాజీపడతారు. విగ్రహారాధన, మూఢభక్తి గురించి తీవ్రంగా చర్చించుకుంటారు. ఆ తర్వాత కాళహస్తి వెళ్ళామని నిర్ణయించుకుని బయల్దేరారు.

## 8

లోపలికి ప్రవేశిస్తూనే ఎంతోఎత్తుగా విశాలంగా ఉన్న దేవాలయాన్ని చూసే సరికి ఆశ్చర్యపోయింది కళ్యాణి. ఎన్నో వందల సంవత్సరాలుగా చెక్కు చెదరక నిల్చున్న రాతిస్తంభాలను వాటిమీద నిల బడిన ఆలయాన్ని చూస్తుంటే కళ్యాణి మనసు చలించిపోయింది ఎంతో కఠినంగా, విశ్వలంగా ఉన్న ఆ రాతి కట్టడాన్ని చూస్తుంటే నిజంగా భర్త చెప్పినట్లు అచంచలము, అద్భుతమూ అయిన భారతీయ సంస్కృతికి సాటియైనదేదీ లేదనిపించింది.'

ఆలయంనిండా ఎక్కడ చూసినా శివలింగాలే! గుడిచుట్టూ ప్రదక్షిణం చేసి, గర్భగుడి దగ్గరకు వెళ్ళేసరికి పదిహేను నిమిషాలు పట్టింది. ఆ దేవుడికి శ్రీకాళహస్తీశ్వరుడన్నపేరు ఎందుకు వచ్చిందో చిన్నప్పుడు పుస్తకాల్లో చదివిన కళ్యాణి, శివలింగం దగ్గరఉన్న సాలెపురుగును, పామును, ఏనుగును చూడాలని ఎంతో ఆత్రంగా గర్భగుడివైపుకు నడచింది.

గర్భగుడిలో కటిక చీకటి. ద్వారందాటి లోపలికి వెళ్ళటానికి వీల్లేదు శివలింగానికీ, తమకీ మధ్యా కొన్ని అడుగులదూరం. ఆ దూరం. చీకటీ ఆమె కంటికి ఏమీ కనపడకుండా చేసినయ్.

'సాలీడు పాము ఏనుగు అన్నీ ఉన్నాయా అక్కడ?' అనడిగింది. కళ్యాణి ఆత్రంగా.

'ఉన్నాయి కాని మీకు కనపడవు' అన్నాడు పూజారి నిర్లక్ష్యంగా.

'ఎందుక్కనపడవు? మేం అంత పాపాత్ములమా?' అని లోలోపల కసిగా అనుకుని పైకి మాత్రం 'మేం యింత దూరం ఎండలో వచ్చింది దైవాన్ని చూట్టానికే కదండీ!' అంది కళ్యాణి వినయంగా.

'ఏడాదికోసారి మాత్రమే భక్తులకు చూపిస్తాం. మామూలు రోజుల్లో దేవుడు ప్రజలకు కనపడడు' అన్నాడు పూజారి.

'గుడి కట్టించిన రోజుల్లోనైతే ఎలక్ట్రిసిటీ లేదు కాబట్టి గర్భగుడి చీకటిగా ఉండేది. ఈ స్పుట్నిక్ యుగంలో కూడా యింకా మీరు గర్భగుడిలో ఎలక్ట్రిక్ దీపాలు పెట్టించటం లేదంటే నాకు ఆశ్చర్యంగా ఉంది. ఐనా 'శ్రీ కాళహస్తి'ని గూర్చి ఎంతో గొప్పగా చెప్పుకుంటారు. ఆ మూడు జంతువుల భక్తిని గురించి పుస్తకాల్లో చదువుకుని పరవశమవుతారు. అందునా యీ దేవుడు మామూలువాడు కాడు. భోలా శంకరుడు. ఈయనకు కూడా భక్తుల యెడల అంత కాఠిన్యం ఉందంటే నేన్నమ్మను. మీరు అబద్ధమాడుతున్నారు...' అని ఆమె యింకా ఏదో అనబోతుండగా కాంతారావు ఆమె చేతిని నొక్కాడు 'ఇంకా మాట్లాడవద్దు' అన్నట్లు.

పూజారి కళ్యాణి వంక వోసారి ఎగాదిగా చూసి మౌనంగా తీర్థం యిచ్చేడు.

కర్పూరం వెలిగించి హారతి దైవానికి పెడుతుంటే ఆ గుడ్డి వెలుగులో లింగం ఆకారం మాత్రం లీలగా కనపడింది. కాని సాలెపురుగు, పాము, ఏనుగు యేమాత్రం కనపడక పోయేసరికి నిరుత్సాహపడి పోయింది, కళ్యాణి.

ఇవతలకు వచ్చేక మనం 'యిక్కడకు రావటం శుద్ధ దండుగ. అసలు నేను వచ్చిందే వాటిని చూట్టానికి. నాలుగైదు సంవత్సరాల వయసులో ఉండగా చదువుకున్న ఆ పాఠంలోని విచిత్ర దేవాలయాన్ని చూడాలని ఎంత ఆరాటపడ్డానో తెలుసా? వీటికోసం కాకపోతే నేను అసలు ఈఎండలో కాళ్ళు బొబ్బలెక్కించుకుని యింతదూరం నడచి వచ్చేదాన్నే కాదు' అంది దీనంగా కళ్యాణి.

'పోన్లే కళ్యాణీ! ఊరుకో బాధపడకు. వాళ్ళరూల్సు వాళ్ళవి. పాపం ఆ పూజారి మాత్రం యేం చేస్తాడు?' అని వోదార్చేడు కాంతారావు.

'అది కాదండీ! అసలు గర్భగుళ్ళో

విల్మక్కి క్కదిపాలు విందుకు పెట్టరూ అంటు! గాలి వెలుతురూ లేనిచోట దేవుణ్ణి బంధిస్తే ఈ మనుషులకు వచ్చేముక్తి ఏమిటీ అంటు? పోనీ ఆ రోజుల్లో యేదో వాళ్ల నమ్మకాలనుబట్టి అలా కట్టించే రనుకోండి. ఇప్పుడైనా కాస్త దేవాలయా లను మోడ్రనైజు చెయ్యవచ్చు కదా. ఆ గర్భగుళ్లో ఫానుపెట్టి వో ట్యూబ్ లైటు పెడ్తే పోయిందేముంది చెప్పండి?' అంది కళ్యాణి.

కాంతారావు నవ్వేడు 'కొన్ని వస్తువు లను వాటి సహజస్వరూపంలో, సహజమైన వాతావరణంలో చూస్తేనే బాగుంటుంది కళ్యాణీ! ఉదాహరణకి లేడిపిల్లలు అడ విలో గంతులు వేస్తుండగా చూస్తుంటే ఎంతో అందంగా కనపడతయ్. పచ్చని చెట్లమధ్య శ్రావణ మేఘాలను చూస్తూ నెమళ్లు పురివిప్పి నాట్యంచేస్తుంటే చూడ ముచ్చటగా ఉంటుంది. పులులు, సింహాలు, ఖడ్గమృగాలు మొదలైన క్రూరజంతువు లను అడవుల్లో వాటి వాటి స్థావరాల్లో ఉన్నపుడు చూస్తుంటేనే ఎంతో థ్రిల్లిం గుగా ఉంటుది. కాని ఆ జంతువు లన్ని టినీ తెచ్చి బోనులో బంధించి మనని వినోదంగా చూడమంటే ఆ జంతువులకూ బాధ! మనకీ వినోదం కలిగదు. 'జూ' లో బోనులో బంధింప బడినపుడు నక్కకీ, నెమలికీ, కాకికీ, కోకిలకూ ఏమీ తేడా కనపడదు మనకి. ఆ కృత్రిమ వాతావర ణంలో వాటి సహజప్రకృతి మరుగున పడి పోవటంవల్ల అవన్నీ కూడా ఒకేరకమైన స్పెసిమెన్స్‌లాగా కనపడతాయ్ మనకి.

అలాగే మన ప్రాచీన దేవాలయాలను కూడా అవి కట్టించినపుడు ఎలాటిస్థితిలో ఉన్నాయో, ఆ స్థితిలో చూస్తేనే మనకు విచిత్రమైన, ఒక అలౌకికానందం కలుగుతుంది. ఈ దేవాలయాలు గోపురాలు యివన్నీ మన ప్రాచీన భారతీయ సంస్కృతికి, కళా ప్రాభవానికి చిహ్నాలు. వీటిని కళ్లతో చూసి, మనసారా ఆనం దించాలే తప్ప, వీటినేదో ఆధునికం చెయ్యాలని చూస్తే మనకి ఎలాటి ఆనం దమూ కనపడదు. గోల్కొండ శిథిలాలను శిథిలాలుగానే చూడాలి. వాటిమీద వో పెద్ద మేడ కడ్తే దానిని చూట్టానికి యాత్రికు లెవరూ రారు. తెలిసిందా?' అన్నాడు.

కళ్యాణి చిత్రంగా చూసింది భర్తవంక. ఆ క్షణంలో అతని విగ్రహం ఎంతో గంభీ రంగా, ఉదాత్తంగా కనిపించింది ఆమెకు.

'వెంకటసుబ్బలక్ష్మి టూరిస్టు సర్వీసు' వాళ్ళు, మరికొందరు భక్త బృందం కూడా



# పిల్లలతో ప్రేమయాత్ర

అక్కడకు బిల బిలమంటూ వచ్చేరు. ఆ విశాల దేవాలయంలో అంతమంది భక్తులున్నా యింకా విశాలంగా, శూన్యంగా ఉన్నట్లుగానే అనిపించింది కళ్యాణికి.

తరువాత కొంత దూరం నడచి, మెట్లు ఎక్కి, చిన్న డాబాలాటి దాని మీదకు తీసుకుపోయేడు దేవాలయాన్ని చూపించే గైడు. అక్కడ 'తిన్న'ని విగ్రహం ఉంది. దానిని చూస్తుంటే కళ్యాణిలో అదో రకం 'థ్రిల్' కలిగింది. తిన్నని పాఠం కూడా తను క్లాసు పుస్తకాల్లో చదువుకుంది చిన్నప్పుడు. అవన్నీ కట్టు కథలేనని తన అభిప్రాయం. కాని నిజంగా తిన్నని విగ్రహాన్ని చూస్తుంటే అందులో కొంత భాగమైనా నిజం కాకపోదనిపించింది కళ్యాణికి.

ఒక ఆటవికుడు తను నమ్మిన దైవం కోసం కళ్ళను త్యాగం చేసేడంటే—అందునా ఆ రోజుల్లో ... ఆశ్చర్యం ఏమీ లేదు. విశ్వాసం అన్నది, ముఖ్యంగా ఆ విశ్వాసం—భగవంతుని మీదదైతే — మానవుడిచేత ఎలాటి సాహసాలనైనా చేయించగలదు అనుకుంది కళ్యాణి.

మిగతా భక్తులందరూ యింకా క్రింద దేవాలయంలో ఉన్నా, కాంతారావు కుటుంబాన్ని మాత్రం ముందు అక్కడకు తీసుకు వచ్చేడు గైడు. వాళ్ళ వేషధారణా అదీ చూస్తే కాస్తో కూస్తో డబ్బులు ముట్టక పోవు అన్న ధైర్యం కలిగిందతనికి. అందుకే ధారాళంగా పాఠం బట్టీ పట్టి అప్పచెపుతున్నట్లు తిన్నడి కథా వగైరా విశేషాలన్నీ చెప్పసాగేడు.

వాళ్ళు పైన నిల్చుని ఉండటంవల్ల ఊరులో చాలా భాగం కనిపిస్తుంది. కొంచెం దూరంలో ఉన్న జలాశయాన్ని చూపి 'అది సువర్ణముఖీ నది' అన్నాడు.

'అబ్బ! సువర్ణముఖి నది అంటే యిదేనా?' అని ఆనంద పడిపోయింది కళ్యాణి.

'ఇటు వైపున ఉన్న ఎత్తయిన గోపురం ఉంది చూసేరా? ఆ గోపురాన్ని ఒక వేశ్య కట్టించింది. తను చేసిన పాపానికి పశ్చాత్తాపపడి, దానికి ప్రాయశ్చిత్తంగా ఆ గోపురాన్ని కట్టించింది తను సంపాదించిన డబ్బుతో' అని చెప్పేడు.

'ఇదంతా చూస్తుంటే పాపానికీ దైవానికీ ఏదో దగ్గర సంబంధం ఉందని పిస్తుంది నాకు, గుళ్ళు, గోపురాలు కట్టించిన భక్తులలో చాలామంది పూర్వాశ్రమంలో పతితులే! ఫరెగ్జాంపుల్...పండరినాథ భక్తుడైన పుండరీకుడు, చింతామణి, విప్రనారాయణ, వేమనయోగి...వీరంతా పతనమైన తరువాతే పరమభక్తు లయ్యేరు.' వ్యంగ్యంగా అంది కళ్యాణి.

'రక్తి లేనిదే ముక్తి లేదు. కామి కాని వాడు మోక్ష కామికాడు' నిర్లిప్తంగా అన్నాడు కాంతారావు.

'అందుకే ప్రపంచం యిలా తగలడి పోతోంది. ఎటుపడీ ఎప్పుడో ఒకప్పుడు మోక్షం వస్తుందన్న దీమాతో చేయగలిగి నన్ని పాపాలూ చేసేస్తున్నారు జనం.' అంది కళ్యాణి వెక్కిరింతగా.

'షటప్!'

'జీ...హుజూర్!'అంటూ పమిట కొంగు నోటి కడ్డం పెట్టుకుని నవ్వాపుకుంది కళ్యాణి.

'అంతా చూపించటం అయిపోయిందండి! ఇంక మీ దయ.!' అన్నాడు గైడ్ చేతులు కట్టుకుని నిలబడి. అతను కుర్రవాడు, వయసు పదిహేడుకి మించదు.

అతని చేతిలో వో అర్ధరూపాయి బిళ్ళ పెట్టేడు కాంతారావు.

'అంతేనా సార్? చదువుకుంటున్న వాడిని. పేదవాడినవటం వల్ల యిలా వేసవి సెలవుల్లో గైడ్ పని చేస్తుంటాను.' అన్నాడు అతను.

'ఏం చదువుతున్నావేమిటి?' అన్నాడు కాంతారావు మళ్లీ జేబులో చెయ్యిపెడుతూ.

'పి యూసీ చదువుతున్నానండీ!'

'పి యూసీనా!' అంటూ ఆశ్చర్య పోయేడు కాంతారావు. అతను కాలేజీ విద్యార్థి అని తెలియగానే ఉపాధ్యాయుడైన కాంతారావులో అదోరకం జాలి, మెత్తదనం కలిగి, మరో రూపాయనోటు తీసి ఆతని కిచ్చేడు.

'అన్నట్టు కాళహస్తిలోది గవర్నమెంటు కాలేజీయే కదూ? ఇంగ్లీషు డిపార్టుమెంటులో ఎంతమందున్నారేమిటి? మీకు పాఠాలు చేప్పేది ఎవరు? ఆయన పేరేమిటి?' అని వో దగ్గర బంధువుని గురించి దూరపు చుట్టాన్ని అడిగినట్లు అడిగేడు కాంతారావు.

'మాకాండీ! మాకూ ... కామేశ్వరరావు గారు వస్తారండీ ఇంగ్లీషుకి' అన్నాడా కుర్రవాడు—యీ వివరాలన్నీ మీకెందు కన్నట్లు చూస్తూ. 'కామేశ్వరరావు' అన్న పేరును తన మూడేళ్ళ ఉద్యోగం సర్వీసు లోనూ ఎన్నడూ విననందున 'అలాగా!' అని ఊరుకున్నాడు కాంతారావు.

వెంటనే వాళ్ళు క్రిందికి దిగి వచ్చేరు. అప్పటికి పన్నెండు దాటింది. వో పక్క ఆకలితో కడుపులు కాలుతుంటే నిప్పులు చెరగుతున్న ఎండలో బండరాళ్ళమీద సర్కసు ఫీట్సు చేస్తున్నట్లు నడుస్తూ వెళ్ళి, అమాంతం దగ్గర్లో ఉన్న ఒక హోటల్లోకి వెళ్ళి కూలబడ్డారు.

హోటల్లో కూర్చుని రెండు ప్లేట్ల భోజనానికి ఆర్డరిచ్చిన తరువాత హాశా త్తుగా కాంతారావు మెదడులో ఒక ఆలోచన తట్టింది. తమకి దేవాలయాన్ని చూపిన గైడ్ అనబడే కుర్రవాడు పీ యూసీ చదవటం లేదేమోనన్న సందేహం ఎందుకో కలిగిందతనికి. అతని మాట తీరూ, అదీ చూస్తుంటే పీ యూసీ చదువుతున్న కుర్రవాడిలా లేనే లేడు. హైస్కూల్లో ఏ యేడో, ఎనిమిదో చదువు తూనో, చదివో ఉంటాడు. తమకి దేవాలయాన్ని చూపిస్తున్నపుడు తాము ఎక్కడ నుండి వస్తున్నదీ, తను ఏం ఉద్యోగం చేస్తున్నదీ వివరాలన్నీ అడిగేడు. తనుకూడా యధాలాపంగా సమాధాన మిచ్చేడు. తను కాలేజీ లెక్చరర్ అని తెలుసుకుని, తన సానుభూతిని పొందేందుకే తను కాలేజీ విద్యార్థినని చెప్పుకున్నాడు. ఎంత మోసం జరిగింది! అనుకున్నాడు కాంతారావు.

పేదకుర్రవాడు, కాలేజీ కుర్రవాడు కానీ, మరెవరైనా కానీ అడిగినప్పుడు డబ్బిస్తే తప్పేం లేదు కాని, అబద్ధమాడి డబ్బు గుంజుకోవలసిన అవసరం అతనికేం ఉంది? మానవ స్వభావమే అంత. అవసరమున్నా లేకపోయినా వంచనతో బ్రతకటం సహజంగానే అలవాటై పోతుంది కాబోలు కొందరికి.

ఎందుకో తాను ఆ కుర్రవాడి మాటలు నమ్మి మోసపోయేనని అనుకోవటానికి కాంతారావు కించపడ్డాడు.

సర్వర్ ఎదురుగా టేబుల్ మీద

# కొన్ని రోజులు ప్రొద్దున్నే మీకు పని మాట అంటేనే అసహ్యము వేస్తుంది



అప్పుడు
మీకు కావలసినది

# వింకోలా-12

అప్పుడప్పుడు మీ ఆహారము మీకు తగినంత, సరియైన రకపు పోషణను యివ్వలేకపోవు. మీకు నిశ్చయముగా, సరియైన పోషణ సరియైన పాళ్లలో లభించుటకు వింకోలా-12ను త్రాగండి. వింకోలా-12లో విటమిన్లు, ఇనుము మరియు గ్లిసరోఫాస్ఫేట్లు తగు పాళ్లలో ఉన్నాయి. కనుక అది మీ నరములకు ఉత్తేజము కలిగిస్తుంది, ఆకలిని అధికము చేస్తుంది. మీకు శక్తి ఉత్సాహములను తిరిగి కలిగిస్తుంది.

వింకోలా-12లో గల పన్నెండు పదార్థములు అలసటను, నిరుత్సాహమును, నీరసమును పోగొట్టుటలో సహకరిస్తాయి. ఇనుము మరియు రాగి రక్తములో ఎర్ర కణములను వృద్ధి చేయుటలో సహకరిస్తాయి, గ్లిసరోఫాస్ఫేటు అలసిన నరములకు ఉత్తేజమును కలిగిస్తాయి మరియు నరముల స్నాయువులను బాగు చేస్తాయి. ఇంకా, విటమిన్లు ఆకలిని, ఆరోగ్యమును అధికము చేస్తాయి.

రోజూ రెండు సార్లు భోజనము తరువాత 2 టేబుల్ చెంచాల వింకోలా-12ను త్రాగుతే మీకు గుణము కలుగుతున్నట్లు గమనిస్తారు. మళ్లీ బాగా ఆకలి వేస్తున్నట్లు, తిరిగి ఆరోగ్యము పొందుతున్నట్లు కనుగొంటారు. అస్తమానము ఉండే అలసట పోయినట్లు మీకే తెలుస్తుంది.




# వింకోలా-12

పోషణనిచ్చే
విటమిను—ఖనిజపు టానిక్



[illegible]

[illegible]

పెట్టిన భోజనం వళ్ళేలు అతని ఆలోచనలకు పడెన్ బ్రేకు వేసినయ్ ఆకలి విజృంభించి అన్నం మీదకు దాడి చేసింది.

భోజనాలు, పాలు, పళ్ళు అన్నీ పిల్లల మారాముల్లో, ఏడుపుల్లో, తల్లి గద్దింపుల మధ్య, తండ్రి కోపం మధ్య తినేసి, ఆదమరచి తల్లిదండ్రుల భుజాల మీద వాలి నిద్ర పోయేరు పిల్లలు.

ఐతే కళ్యాణికి, కాంతారావుకి మాత్రం విశ్రమించేందుకు చోటు, సమయం రెండూ లేవు. మధ్యాహ్నం మూడున్నరకి కంచికి వెళ్ళే బస్సు కాళహస్తిలో బయలుదేరుతుంది. అందుకని టికెట్లు కొనుక్కుని బస్సుస్టాపు దగ్గర కూలబడి, పిల్లలను వళ్ళో పెట్టుకుని కబుర్లు చెప్పుకుంటూ కాలక్షేపం చేసేరు

ఆ బస్సుస్టాపు దగ్గర నీడలేదు. దుకాణాల ముందు ఉన్న చిన్న నీడలోనే కంచికి పోయే యాత్రికులందరూ కూర్చున్నారు. ఎప్పుడు మూడున్నర అవుతుందా, ఎప్పుడు బస్సు వస్తుందా అని ఎదురు చూస్తూ.

'వళ్లంతా నొప్పులుగా ఉందండీ! కంచి వెళ్ళేటప్పటికి ఎంతవుతుందో!' అన్నది కళ్యాణి.

'అప్పుడే మొదలుపెట్టేవ్ గారాలు! ఏడు – మహా అయితే ఎనిమిదికంటె ఎక్కువ అవదు కంచికి వెళ్ళేసరికి' అన్నాడు కాంతారావు భార్య కళ్ళలోకి ప్రేమగా చూస్తూ.

'అతనికళ్ళల్లో ఆర్ద్రంగా మెరుస్తున్న

# పిల్లలతో ప్రేమయాత్ర

ప్రేమను చూసేసరికి హఠాత్తుగా యే యింద్రజాల మహిమవల్లనో యిక్కడున్న మనుషులు, పరిసరాలు అన్నీ మాయమయ్యి తామిద్దరే ఒకరి కళ్ళలోకి ఒకరు చూసుకుంటూ కూర్చుంటే ఎంత బాగుండును!' అనుకుంది కళ్యాణి.

'నాకు మీఒళ్లో తలపెట్టి పడుకోవాలనుంది. కూర్చోలేక పోతున్నాను' అంది పక్కవాళ్ళెవరికీ వినపడనంత మెల్లగా.

'నాకూ అలాగే అనిపిస్తోంది...' పరధ్యాన్నంగా అటూ యిటూ చూసి కళ్యాణి చెయ్యిని తనచేతుల్లోకి చాటుగా తీసుకుని మెత్తగా వత్తేడు కాంతారావు.

ఇంతలో పదీ పన్నెండేళ్ల కుర్రవాడు అక్కడకు వచ్చేడు. 'కంచికి వెళ్తున్నారా సార్?' అనడిగేడు కాంతారావుని చూస్తూ.

'ఔను' అని ముక్తసరిగా సమాధానమిచ్చేడు కాంతారావు.

'మీదేవూరండీ? విజయవాడా, హైద్రాబాదా?' అనడిగేడు.

కళ్యాణి, 'కాంతారావు ఒకరి మొహం ఒకరు చూసుకున్నారు 'ఏమిటి, ఆ ఊరి పేర్లు మన మొహాలమీద వ్రాసిఉన్నట్లు అలా అడుగుతా డేమిటి? అన్నట్లు.

పైకి మాత్రం నవ్వేసి 'ఖచ్చితంగా కనుక్కున్నావోయ్! మా అసలు ఊరు విజయవాడ. ప్రస్తుతం హైదరాబాద్‌లో ఉద్యోగం చేస్తున్నాను. ఇంతకీ మనదే ఊరేమిటి?' అన్నాడు. హుషారుగా కాంతారావు

'మాది చిత్తూరండీ!' అన్నాడు గర్వంగా 'చిత్తూరు కంతటికీ అధికారిని నేనే' నన్నంతఠీవి కనపడిందా తని మొహంలో.

'ఇంతకీ మా ఆచూకీలు కనుక్కోనేందుకు నీకేం అవసరం వచ్చిందేమిటి?' అనడిగేడు కాంతారావు

'అది కాదండీ! మిమ్మల్ని చూస్తుంటే చదువుకుని ఉద్యోగం చేస్తున్న వారిలా ఉన్నారు. ఇద్దరు పసిపిల్లలుకూడా ఉన్నారాయే! మీకు పనిపిల్లవాడి అవసరం ఉండక పోతుందా అనిపించింది. అమ్మగారు చూస్తుంటే నాజూకు మనిషిలా ఉన్నారు. పన్లనీ చేసుకోగలరో లేరో నన్ను మీయెంట తీసుకెళ్లండి బాబూ! పిల్లల్నాడిస్తాను పచ్చడి నూరుతాను పప్పు రుబ్బుతాను. కూరలు కొనుక్కొస్తాను – మీరేపనిచెప్తే ఆపని చేస్తాను బాబూ! ఎక్కడా పని దొరక్క కూటికిలేక చస్తున్నాను బాబూ!' అన్నాడు దీనంగా.

'ఇలా ఉన్నపాటున మాతో వస్తానంటున్నావు. మీ అమ్మా నాన్నా వాళ్లకెవరికీ చెప్పనక్కర్లేదా?' అనడిగేడు కాంతారావు.

'మా అమ్మా నాన్నా నా సిన్నతంలోనే సచ్చిపోయేరండీ!' అంటూ చటుక్కున చొక్కాఅంచుతో కళ్ళొత్తుకున్నాడా కుర్రవాడు.

కళ్యాణి గుండె విలవిల లాడిపోయింది.

'అయ్యోపాపం, అలాగా! మరి యిప్పుడు నువ్వెవరి దగ్గర ఉంటున్నా వేమిటి?!' అనడిగింది కళ్ళనీళ్లను బలవంతాన ఆపుకుని, పాపను మరింత దగ్గరగా గుండెకు హత్తుకుంటూ.

'మా చిన్నాన్న వాళ్ళక్కడుంటున్నారండి. వాళ్లదగ్గరే ఉంటున్నాను. మాపిన్ని రోజూ నన్ను తిడ్తుంది కొడ్తుంది అన్నం సరిగ్గా పెట్టదు. రోజూ అర్ధాకలితోనే పడుకోవాలి. అందుకే మీలాటి వాళ్లెవరయినా కనిపిస్తే వచ్చేసి మీదగ్గర పని చేసుకుంటూ పడుందామ కుంటున్నాను.' అన్నాడు.

కళ్యాణి హృదయం జావలాగా అయిపోయింది అతనిమాటలు వింటుంటే.

'పాపం కుర్రవాడు ఎన్నిఅవస్థలు పడు



తున్నాడో! ఈ పిల్లలతో నాకూ అవస్థగా ఉంది పన్లు చేసుకోవాలంటే. ఎటుపడీ ఒక పనివాడిని పెట్టుకోవాలని అనుకుంటున్నాం కదా మనం. వస్తానని వెంట పడివచ్చే ఈ కుర్రవాడిని తీసుకువెళ్తే మంచిది కాదూ? పరాయి ఊరి వాడయితే చెప్పినట్లు యింట్లోపడి ఉంటాడు కూడా' అని యింగ్లీషులో అన్నది భర్తతో, కుర్రవాడికి తనన్నమాటలు అర్థం కాకూడదనే దృష్టితో.

'పనిపిల్లవాడి అవసరం మనకున్నమాట నిజమేననుకో? కాని మనం యిప్పుడు వెళ్తున్నది హైద్రాబాద్ కాదుకదా యాత్రలో ఉన్నాం. ఇంటికి చేరుకునేసరికి మరో పది పదిహేను రోజులు పడుతుంది. ఇన్నాళ్లా వీడికి కూడా ఛార్జీలుపెట్టి వెంట ఎక్కడ తీసుకుపోతాం?' అన్నాడు.

'అదీ నిజమేననుకోండి మన అడ్రెస్ యిస్తే సరి పదిహేనురోజుల తరువాత హైద్రాబాద్ రమ్మని చెప్పండి. కుర్రవాడు చూస్తుంటే ఘటికుల్లానే ఉన్నాడు. హైద్రాబాదు వచ్చేడంటే మనింటి అడ్రసు బాగానే కనుక్కోగలడు' అంది కళ్యాణి.

వాళ్ల సంభాషణంతా ఇంగ్లీషులోనే సాగుతున్నప్పటికీ కళ్యాణి అన్న 'అడ్రెస్' అన్నమాట విని వాళ్లేం మాట్లాడుకుంటున్నదీ తెలిసి చటుక్కున 'ఔను బాబూ! మీరు కనుక హైద్రాబాద్‌లో ఎక్కడుండేదీ యింటి నంబరుతోసహా వ్రాసిచ్చేరంటే మీరెప్పుడు రమ్మంటే అప్పుడు వస్తాను' అన్నాడు ఉత్సాహంగా కుర్రవాడు.

కాంతారావు ఓ కాగితం మీద తమ అడ్రెసు వ్రాసి 'పదిహేను రోజుల తరువాత యీ అడ్రెసు తీసుకొని రా' అంటూ ఆ కాగితం చేతిలో పెట్టాడు

కాగితాన్ని జేబులో పెట్టుకుని రెండు చేతులూ కట్టుకుని నిలబడి 'మరి రావటానికి ఛార్జీ ఎలాగండీ!' అన్నాడు దీనంగా.

'అరి పిడుగా!' అనుకున్నాడు కాంతారావు.

'అదీ నిజమేననుకోండి. ఛార్జీకి డబ్బులివ్వందే వాడు మాత్రం ఎలా వస్తాడండీ?' అంది కళ్యాణి.

'చూస్తూ చూస్తూ ముక్కూ మొహం తెలియని కుర్రవాడికి ముప్పైలు, నలభైలు మనమెక్కడివ్వగలం?' అన్నాడు

కాంతారావు:

'మీరు చెప్పింది నిజమే. ఆ సంగతి వాడితోనే చెప్పండి' అంది కళ్యాణి.

'చూడు బాబూ! నువ్వు మా యింటికి రావటం మాకూ యిష్టమే కానీ, అంత పెద్ద మొత్తం నిన్ను నమ్మి ఎలా యివ్వను చెప్పు ?' అన్నాడు కాంతారావు.

'పోనీ మీకంత విశ్వాసం లేకపోతే వో పదిరూపాయ లిప్పించండి బాబూ! మిగతా డబ్బులు నేనే ఎలాగోలా కూడబెట్టుకుని వస్తాను.' అన్నాడా కుర్రవాడు.

ఈ సూచన భార్యా భర్త లిద్దరికీ కూడా నచ్చటంవల్ల కాంతారావు జేబులో నుండి పదిరూపాయల నోటు తీసి కుర్రవాడి చేతిలో పెట్టాడు 'అడ్రెసు మాత్రం జాగ్రత్త సుమా. పారవేసుకునేవ్!' అంటూ హెచ్చరించేడు.

'అలాగే బాబూ! ధర్మాత్ములు మీరు. నేనివ్వాళ లేచినవేళ మంచిదయింది' అని ఆ పదిరూపాయల నోటును కళ్ల కద్దుకుని వెళ్లిపోయేడు.

కళ్యాణి అప్పుడే ఆ కుర్రవాడు తమ యింట్లో పనికి కుదిరినట్లు, వాడి సాయంతో వంట పని గంటలో ముగించేసి, తను, భర్తా యిద్దరూ కలసి వాడు వడ్డిస్తుంటే భోజనంచేసి, భర్త కాలేజీకి పోయేక పిల్లలను వాడి కప్పగించేసి తాను సోమరిగా కాసేపు పడుకుని కలలు కని ఆ కలలను కాగితం మీద పెట్టేసి, పత్రికలకు పంపి, తన రచనా చాతుర్యంతో తెలుగు పాఠకలోకాన్నంతటినీ ఆకట్టుకుని అనతి కాలంలోనే ప్రఖ్యాత రచయిత్రిగా కీర్తి గడించినట్టు... ఊహించుకుని తీయని కలల్లో తేలిపోసాగింది.

ఆ కుర్రవాడు వెళ్లిపోయిన ఐదు నిమిషాలకు వాళ్ల పక్కనే కూర్చున్న వో బాన బొజ్జ అయ్యంగారు వచ్చీరాని యింగ్లీషులో కాంతారావుని 'అబ్బాయికి పది రూపాయలు ఎందుకండీ మీరిచ్చింది ?' అనడిగేడు.

కాంతారావు అంతా వివరంగా చెప్పేసరికి ఆయన బొజ్జ అటూ యిటూ ఉయ్యాలలా ఊగేట్లు పెద్ద పెట్టున నవ్వి 'అయ్యో! మీరెంత అమాయకులండీ!' అన్నాడు.

కాంతారావు బిత్తరపోయేడు.

కళ్యాణి గతుక్కుమంది.

# పిల్లలతో ప్రేమయాత్ర

'ఎందుకండీ అలాగంటారు ?' అని నీరసంగా అడిగేడు కాంతారావు.

'మీరు ఎంత పిచ్చివాళ్లు కాకపోతే వాడి మాటలు నూటికి నూరుపాళ్లు నిజమని నమ్మేరండీ! వాడంత పనికోసం పడి చస్తున్నవాడైతే యీ కాళహస్తి మొత్తం మీద పని కావలసిన కుటుంబాలే లేవంటారా ? అంత దూరం హైదరాబాద్ రావలసిన ఖర్మ వాడికేం పట్టింది? ఒకవేళ ఉన్నా సరాసరి హైదరాబాద్ పోతాడు కాని, యాత్రలో తిరుగుతున్న మనుషులను పట్టుకుని పనిప్పించమని అడుగుతాడా? ఐనా యివ్వాళ వీడి అదృష్టం పండింది. పది రూపాయలు పదినిమిషాల్లో ఏ మాత్రం చెమటోడ్చకుండా సంపాదించేడు' అన్నాడాయన.

'అయ్యో, ఆ పిల్లడు తనకి అమ్మా నాన్నా ఎవ్వరూ లేరని కూడా అనేసరికి నాకు జాలేసిందండీ' అంది కళ్యాణి.

'కూటికోసం, కోటి విద్యలన్నారమ్మా అందుకే! డబ్బు మనిషి చేత ఎలాటి గడ్డి నయినా తినిపిస్తుంది. డబ్బు అవసరం వస్తే యిలాటి జిత్తులమారి వెధవలు బ్రతికున్న వాళ్ళని చంపెయ్యగలరు. చచ్చిన వాళ్ళను బ్రతికించగలరు కూడా, పాపం. మీరింకా చిన్నవాళ్ళు. అనుభవం తక్కువ. అనుభవం ఉన్నవాణ్ణి నేను చెప్తున్నాను వినండి. జీవితంలో ఎప్పుడైనా సరే యిలా పేదవాణ్ణి, ఆ వాణ్ణి యీ వాణ్ణి అనే వాళ్ళను ఛస్తే నమ్మకండి. వాళ్ళు మీ కంటె, నాకంటె సుష్టుగా మూడు పూటలా కడుపు నిండా తింటారు. పైగా యిలా మీలాటి అమాయకులను బోల్తా కొట్టించి డబ్బు గుంజుకుని సిగరెట్లకు, సినిమాలకు ఖర్చు పెట్టుకుంటారు. ఈ భారతదేశంలో పేదరికం అన్నది పేరుమీదనేనండీ ఉంది. తిండి లేక చచ్చేవాళ్ళు ఎవ్వరూ లేరు మన దేశంలో. అందునా కాళ్ళూ చేతులూ రెండు ఉండి కష్టపడి సంపాదించగల కండ బలం గల మనిషెన్నడూ ఆర్థికలితో ఉండవలసిన అవసరం లేదు కార్మిక శక్తికి కర్షక శక్తికీ యీనాడు అన్ని విధాలా జయం లభిస్తోంది. ఇక పోతే మనదేశంలో ఎవడైనా ఆర్థికలితో ఉన్నాడూ అంటే వాడు మధ్య తరగతి సంసారేనని నా గట్టి నమ్మకం. ఇటు కష్టపడి సంపాదించిన డిగ్రీలిచ్చే జీతాలు చాలక, అటు కండబలం లేక చాలీ చాలని తిండితో, తీరీ తీరని అవసరాలతో అన్ని విధాలా నలిగిపోతున్నది మధ్యతరగతి కుటుంబీకుడేనండీ! ఈ లేబర్ క్లాస్ వాళ్ళు, డిగ్రీలున్న, జీతాల మీద బ్రతికే మధ్య తరగతి కుటుంబీకుల కన్నా వెయ్యిరెట్లు బలంగా, ఆనందంగా ఉన్నారు. వీళ్ళకు జీవనోపాధిని ఎలా సంపాదించుకోవాలో మనకన్న బాగా తెలుసు. అవసరమైతే వంచనతోనో దొంగతనం చేసో లేదా ఖూనీ చేసైనా వీళ్ళు కడుపులు నింపుకుంటారు కాని; వీళ్ళు మాత్రం చస్తే పస్తులు పడుండరండీ! చస్తే పస్తులుండరు.' అన్నాడు ఉద్రేకంగా ఆయన.

ఆయన మాటలో ఎంత నిజముందో ఆలోచించే తీరిక, వోపికలేవు ఆ దంపతులకు.

గుడిలోని గైడ్ దగ్గర మోసపోయేనేమోనని అనుమాన పడ్డాడు. ఇప్పుడు తను ఖచ్చితం మోసపోయేడు. ఎంత అవమానం! తన తెలివితేటలు, లోకజ్ఞానం అన్నీ యేమైనయ్? అదీ కాంతారావు బాధ!

'ఐతే ఆ కుర్రవాడు మనింటికి రాడన్నమాట. ఇంటికి వెళ్ళేక యింక రోజుల్లా వంటింట్లో కూరలతో, పచ్చళ్ళతోను, ఆ తరువాత పిల్లలతోనూ రోజుల్లా కుస్తీ పడుతుండాలిసిందే తను. తన కలలు కనే తీరిక వాటిని కాగితం మీద పెట్టే వోపిక యింక ఎలా వస్తాయి? ఈ జన్మకింక యింతే! రచయిత్రి అయ్యే భాగ్యం తనకు లేదు. ఖర్మ!' అంటూ తన కలలన్నీ చెదిరిపోగా, వాస్తవిక జీవితంలోకి వచ్చిన కళ్యాణి వాపోవ సాగింది.

వాళ్ళిద్దరూ ఆ షాక్ నుండి తేరుకునే సరికి కంచి బస్సు వచ్చి స్టాండులో రెడీగా నిల్చుంది. అంతా ఆదరా, బాదరా బస్సు ఎక్కేరు. ఆ ఎక్కిన వాళ్ళందరూ ముందుగా టికెట్లు కొనుక్కున్నవారే! తమకోసం బస్సులో సీటు రెడీగా ఉంటుందని తెలిసి కూడా మూడవ తరగతి రైలుపెట్టెలోకి, రిజర్వు చెయ్యని సీట్ల కోసం ఎగబడే ప్రయాణీకుల్లా అందరూ, ఒకరినొకరు తోసుకుంటూ ఒకరిమీద ఒకరు పెట్టెం

తోను, వంచులతోను నొక్కుకుంటూ వెళ్ళి బస్సులో కూర్చున్నారు 'ఫస్టు క్లాస్‌లో ప్రయాణం చేసేప్పుడు కూడా భారతీయుల మనస్తత్వం థర్డ్‌క్లాస్ ప్రయాణికుడి ధోరణిలోనే ఉంటుంది' అనుకున్నాడు భార్య, పిల్లలతో సీటు వెతుక్కుని సుఖంగా కూర్చున్న తరువాత కాంతారావు. అతని షర్టంతా ఆ జన సందోహం మధ్యపడి నలిగిపోయింది. వంటి నిండా చెమట కారుతోంది.

జనం అంతా ఎక్కి బస్సులో కూర్చున్న తరువాత వాళ్ళ టికెట్లన్నీ చెక్ చేసి అప్పుడు కండక్టరు డ్రైవరుతో సహా వెళ్ళి హోటలులో ఫలహారం, కాఫీ సేవించి బీడీ కాల్చుకుంటూ వచ్చేడు.

మొత్తానికి బస్సు బయలుదేరేసరికి ఇరవై నిమిషాలకు పైగానే అయింది. అప్పటివరకూ పిల్లలను ఆపటం కష్టమై పోయింది కళ్యాణి, కాంతారావులకు. వాళ్ళు అడిగిన అడ్డమైన చెత్తా కొనిచ్చినా, వాళ్ళు మాత్రం అల్లరి మానలేదు సరి కదా, ఇంకా గారాలు చెయ్యసాగేరు. కళ్యాణి లోలోపలే వళ్ళు మాయికుంది వాళ్ళ నేమీ చెయ్యలేక. కాంతారావు విరసంగా తల చేతులో పట్టుకుని 'మీ ఖర్మ! మీ యిష్టం వచ్చినట్లు అల్లరి చేసుకోండి' అన్న పోజులో కూర్చున్నాడు.

ఎలాగైతేనేం బస్సు కదిలింది. కాసే పటికి పిల్లల అల్లరి కూడా సద్దుమణిగింది. చల్లగాలికి ప్రయాణికులందరికీ నిద్రమత్తు ఆవహించింది. ప్రతి ఒక్కరూ ఏ ఒకటి, రెండు గంటలలో కాస్త కునుకు తీసేరు. నాలుగు గంటలకు ఏదో ఒక ఊళ్లో బస్సు ఆగితే చాలామంది హోటల్లోకి వెళ్ళి ఫలహారాలు చేసేరు ప్రయాణికులు.

కంచికి చేరుకునేసరికి రాత్రి ఎనిమిది గంటలు కావస్తోంది బస్సులోనే కంచికి వెళ్తున్న ఒక తోటి ప్రయాణికుణ్ణి అక్కడ వంచి హోటలేదో కనుక్కుని పేరు గుర్తు పెట్టుకున్నాడు కాంతారావు.

**(ఇంకా ఉంది)**




✷ మనం ఆచరణలో పెట్ట వలసిన మంచి గుణాలు ఎన్నో ఉన్నాయి. అన్నింటినీ అల వరుచుకోవడం సాధ్యం కాకపోవచ్చు. అన్నిటినీ కాకపోయినా కొన్నిటినయినా ఆచరణలో పెట్టుకోవడం సాధ్యపడుతుంది.

ముఖ్యంగా మూడు ఉత్తమ గుణాలు అవసరమైనవి. ఆ మూడింటినీ స్వాధీన పరచుకుంటే మానవునికి విరోధులన్నవారు ఉండరు. అందరిలోనూ గొప్పపేరు తెచ్చుకోవచ్చును.

గాంధి మహాత్ముని జీవితంలో ప్రాముఖ్యాన్ని వహించినవి మూడు ఉత్తమ గుణాలు! అవి—చెడ్డమాటను మాటలాడకుండడమూ, చెడ్డమాటను వినకుండా ఉండడమూ, చెడ్డదానిని చూడకుండా ఉండడమున్నూ.

మంచిగా మాటలాడితే అందరూ గౌరవిస్తారు. చెడ్డగా మాటలాడితే అందరూ నిందిస్తారు. దుర్జనుడనే పేరు తెచ్చుకోవడం చాలా సులభమనీ, మంచివాడనే పేరు ఎంతో కష్టపడితేనేకాని రాదనీ నీతివేత్తలు చెప్తారు. మంచిగా మాటలాడడం చేతకాకపోతే ఊరుకోవడం ఉత్తమం, చెడ్డ మాటలుమాత్రం నోటంట రాకూడదు.

ఆ విధంగానే— చెడ్డమాటలు మాటలాడకుండా వున్నంతమాత్రాన సరిపోదు. ఎవరైనా అట్టిమాటలు చెప్తూవుంటే వానిని వినడంకూడా ఉచితం కాదు. కాళిదాసు—

'నకేవలం యో మహతోఽపభాషతే
శృణోతి తస్మా దపి యఃస పాపభాక్.'

అని పెద్దవాళ్లను నిందించిన వాళ్లకే కాకుండా, అలా నిందస్తూ ఉండగా విన్న వాళ్లకుకూడా పాపం వస్తుంది— అని చెప్పి వున్నాడు. అందువల్ల ఇతరులు చెడ్డ మాటలు పలుకుతూ వుండగా వినడం కూడా ఉచితంకాదు.

ఇట్టివి వినడం ఎంత అనుచితమో, చెడ్డవాటిని చూడడంకూడా అంత అనుచితమే. అందువల్లనే సహృదయులూ, మెత్తని మనస్సు కలవారు ఏదైనా అసందర్భమైన—కష్టమైన పని జరుగుతూ ఉంటే ఆ వైపునకు పోరు. సమీపంలో ఆ పని జరుగుతూ ఉంటే అటుచూడక ముఖం ప్రక్కకు తిప్పుకుంటారు.

అందువల్ల చెడ్డ మాటాడము, చెడ్డమ్మ వినము, చెడ్డను చూడము—అని నియమం పెట్టుకోవాలి.

మహాత్ముడు మూడు మర్కట రూపాలను మిక్కిలి ఆదరించేవాడు—నోరు మూసుకుంటున్న దొకటి. చెవులు మూసుకుంటున్నది యింకొకటి; కన్నులు మూసుకుంటున్నది మరొకటిన్నీ. వాటి అభిప్రాయం—చెడ్డను మాటాడవన్నీ, చెడ్డను వినవన్నీ, చెడ్డను చూడవన్నీ. ●




'ఇగ్నొరెన్స్ ఈజెబ్లిస్' అని ఇంగ్లీషులో ఒక లోకోక్తి...మూర్ఖత్వం వరమతుందా? కళ్ళుంటే కాళరాత్రి భయానక దృశ్యాలు చూడవలసి వస్తుందని కళ్ళు పోవాలని కోరుకుంటారా? ఏదో ఒక నాటికి సృష్టిలో అందాలు చూడగలిగే అదృష్టాన్ని క్షణిక భయానికి శాశ్వతంగా దూరం చేసుకుంటారా?

కుమిలి కుమిలి ఏడుస్తోంది లీల. ఆవిడను చూస్తోంటే నాగుండె తరుక్కుపోతుంది—ఇంత అనర్థానికీ నేనే కారణమా అని అంతరాత్మ నన్ను అడుగడుగునా నిలదీసి అడుగుతోంది—

జ్ఞానను ఆమె మూర్ఖత్వంలో మైను ఉండనిస్తే ఇలా జరిగేది కాదేమో! పని కట్టుకుని చదువు చెప్పాను—అనేక పుస్తకాలు చదివించాను—సొంతంగా ఆలోచించటం అలవాటు చేసాను—

జ్ఞాన చురుకైనది! కొంచెం అందిస్తే చాలు చకచక ముందుకు సాగిపోయేది! అయితే ఒకనాడు జ్ఞాన కన్నీళ్ళనుచూసి అదిరిపోయాను! ఎప్పుడూ అమాయకంగా నవ్వే ఆ కళ్ళల్లో కన్నీళ్ళు! అవును! తన పరిస్థితి ఏమిటో తాను అర్థం చేసుకోగలిగితే జ్ఞానకు కన్నీళ్ళుగాక మిగిలేదేముందీ?

జ్ఞాన కన్నీళ్ళు చూసినరోజునే విచికిత్స మొదలయింది. జ్ఞానమనసు వికసింప చేయటానికి ప్రయత్నించి నేనామెకు చేస్తున్నది ఉపకారమా, అపకారమా, అని...

జ్ఞాన రాజుని తనతో తీసుకుని వెళ్ళిపోయింది!

ఆ మాట విన్నక్షణంలో అంతులేని ఆశ్చర్యం కలిగింది—నమ్మలేక పోయాము!

ఛ! జ్ఞాన అలా చెయ్యదు! ఒక్కనాటికీ చెయ్యదు—' అన్నాను నమ్మకంగా...

తనను తాను తెలుసుకున్నాక జ్ఞానలో జీవితంపట్ల ఏదో కసి పెరిగిన మాట వాస్తవమే! కానీ, జ్ఞాన మంచిది! జ్ఞానలో పెరిగిన కసి జ్ఞాననే దహిస్తుంది. కాని మరొకరిని నాశనం చెయ్యదు...

'వదినగారూ! మీ రొక్కసారి రావాలి; లీల తిండీ నీళ్ళూ మానేసి ఏడుస్తోంది' బతిమాలుకున్నాడు మా మరిది!

అతని ముఖం చూడలేక తలతిప్పుకున్నాను. జ్ఞాన రాజును తనతో తీసుకుపోయిన మాట నిజమే. అయితే అందుకు

ఈ మహానుభావుడి నిర్వాకమే ముఖ్యకారణం. లీలకోసం బయలుదేరి వెంటనే మా మరిది ఇంటికి వెళ్ళాను—

లీల కొంత అమాయకురాలు! ముఖ్యంగా దేనికీ నోరు మెదపదు కొన్ని కొన్ని సందర్భాల్లో ఇది మంచి లక్షణమే అయినా కొన్ని కొన్ని సందర్భాల్లో ఇదే ప్రాణం మీదికి తెస్తుంది. తన భర్త మాటలకూ చేష్టలకూ, ఈవిడ నోరు కదిపి ఏమీ అనదు ఆ చేష్టలన్నీ ఈవిడకూ అంగీకార మనుకోవాలో, లేక పూర్వకాలపు ప్రతివ్రతల్లోంచి దిగి వచ్చిందనుకోవాలో మాత్రం ఎవరికీ అర్థంకాదు లీల తానై జ్ఞానకు అన్యాయం చెయ్యలేదు కానీ భర్త చేస్తుంటే వద్దని వారించలేదు! ఆస్తి మీద మమకారం లీలకు మాత్రంలేదని ఎలా చెప్పగలం?

నన్ను చూడగానే కౌగిలించుకొని బావురుమంది లీల!

ఒక్కరోజులోనే వెయ్యి లంఖణాలుచేసిన మనిషిలా అయిపోయింది కళ్ళు ఏడ్చి ఏడ్చి బాగా ఉబ్బిపోయాయి.

'నిజమా!' అని ఎవరినీ అడగక్కర్లేకుండానే జ్ఞాన రాజుని తీసుకుని వెళ్ళిపోయిందని అర్థమయింది!

ఎలా చెయ్యగలిగింది జ్ఞాన ఇంత పని! ఎంత ఆలోచించినా జ్ఞాన ఇంత రాక్షసంగా ఉండగలదని అనుకోలేక పోతున్నాను లీల భర్త విషయంలో ఎలాంటి ప్రతివ్రతో పిల్లలవిషయంలోనూ అలాంటితల్లి—పిల్లలు వర్షంలో తడుస్తున్నా గట్టిగా మందలించదు. అడ్డమైన గడ్డీ తింటున్నా అదేమని అడగదు. మీదపడి పీకి పేచీలుపెట్టినా శాంతంగా సహిస్తుంది వాళ్ళ పేచీలు ఎలాంటివైనా మందలించదు సరిగదా కొండమీది కోతి కావాలన్నా తెచ్చియ్యటానికే ప్రయత్నిస్తుంది—

అలాంటి లీల రాజును వదిలి ఒక్క రోజు ఉండలేక పోయిందంటే ఆశ్చర్యం లేదు—'అక్కయ్యా! ఇదిగో ఈ ఉత్తరం చూడండి ..' వెళ్ళిపోయిన జ్ఞానవ్రాసిన ఉత్తరాన్ని నాచేతుల్లో పెట్టింది లీల—

'ప్రియ లీలకు,

ఆశీర్వచనము...—నా కొడుకు రాజును తీసుకుని నేను వెళ్ళిపోతున్నాను— మీకు చెప్పినా నామీద ప్రేమచేత వెళ్ళనివ్వరని చెప్పకుండా వెళుతున్నాను — ఎక్కడికో, ఇంకా నిర్ణయించుకోలేదు.

తర్వాత మళ్ళీ వ్రాస్తాను—మరిదిగారిని అడిగానని చెప్పు—

న

అక్కయ్య, జ్ఞాన...'

జ్ఞాన 'నాకొడుకు' క్రింద గట్టిగా గీత గీసింది—అది చూడగానే అంత దుఃఖం లోనూ నాకు చిన్న చిరునవ్వు వచ్చింది—జ్ఞాన ఈపని తప్పకుండా ప్రతీకారం తీర్చుకోవటానికే చేసింది! 'నామీద ప్రేమ చేత వెళ్ళనివ్వరని' అని చెప్పి పొడవటం లోనే అది స్పష్టంగా అర్థమవుతోంది.

జ్ఞాన ఇంత దారుణంగా ప్రతీకారం తీర్చుకోవటానికి సిద్ధమయిందంటే తన మనసు ఎంతగా క్షోభించి ఉండాలో......

తలెత్తి మా మరిదివంక చూసాను—కత్తివేటుకు నెత్తురు చుక్కలేకుండా పాలిపోయి ఉంది ..

'వదిన ఇలా చేస్తుందని ఎప్పుడూ అనుకోలేదు ..' అన్నాడు గొణుక్కుంటున్నట్లు. 'అన్యాయాలను సహించటానికి కూడా ఒక అంతంటూ ఉంది—' మనసులో అనుకున్నాను—లీల ముఖం చూస్తూ పైకి అనలేక పోయాను .

'బావగారుకూడా వెళ్ళారా?'

మా మరిదిని అడిగాను ..

'అన్నయ్యా!! డికొక మనసంటూ ఉందా? వదిన ఎంతచెప్తే అంత!'

ఈసడింపుగా అన్నాడు మామరిది!

అవును! ఆయనకు మనసంటూ లేదు! ఉంటే ఈనాడు జ్ఞాన ఇలా అవస్థపడవలసిన అవసరం వచ్చేదికాదు!

తహసిల్దారు కోదండ రామారావుగారు ఏరికోరి జ్ఞాన ప్రసూనాంబను తన కోడలిగా చేసుకుంటామన్నారు—

జ్ఞాన పెద్ద అందగత్తె కాకపోయినా అనాకారి కాదు— సంపన్నురాలు కాదు— ఏమనుకోలేదు—అలాంటి జ్ఞానను అంత సంపన్నుడు కోడలిగా వస్తే ఒక్కరు కూడా 'ఎంత అదృష్టం!' అనలేదు! అంతా 'అయ్యోపాపం!' అన్నారు— కారణం జ్ఞానను చేసుకున్న శేషశాయి వట్టి అప్రయోజకుడు—వెర్రి బాగులవాడు!

'ఏదేలాఉన్నా, కలిగినింట్లో పడింది సుఖపడుతుంది—'అని కళ్ళనీళ్ళు తుడుచుకున్నారు తల్లిదండ్రులు—

కానీ, కలిగినింట్లో పడ్డ జ్ఞాన పొందిన సుఖాలేం లేవు!

ఒక మహాసత్రంలా ఉండే ఆ యింట్లో వంటలక్క స్థానం లభించింది జ్ఞానకు—మామూలు వంటలక్కలకు ఒకప్పుడు కాకపోతే ఒకప్పుడైనా కాస్త తీరిక ఉంటుంది—కానీ, జ్ఞానకు రాత్రి పదయినా పని తెరిపి కాదు—

వెర్రిబాగుల వాడి పెళ్ళానికి, చీరలు, జాకెట్లు నగలూ పువ్వులు ఎందుకని దూరం ఆలోచించి అవేవీ ఆవిడ దరిదాపులకు రాకుండా జాగ్రత్తపడ్డారు—ఏమాట కామాటే చెప్పుకోవాలి ... అంతా కారులో వెళ్తున్నప్పుడు మాత్రం ఆవిడను కూడా తీసికెళ్ళేవారు! మరి ఆడపడచుల పిల్లలకు మూతులూ, ముక్కులూ తుడవటానికి ఎవరో ఒకరు కావద్దూ?!

కోడలిగా ఆఇంట్లో అడుగుపెట్టిన నేను ఆవిడ పరిస్థితి చూసి నిర్ఘాంతపోయాను. అన్నింటికంటె ఆవిడ ముఖం మీది చెక్కుచెదరని చిరునవ్వు నన్ను ఆశ్చర్యపరిచేది! ఆవిడను చూసి నేను బాధపడుతున్నాను. నామాత్రం కూడా ఆవిడకు బాధగా లేదా?

ఆవిడను ఎలాగైనా చదివించాలని పూనుకున్నాను. సాధించగలిగాను ఆవిడ మెట్రిక్ పాసయింది. కనిపించిన ప్రతి పుస్తకమూ చదవసాగింది. కానీ పెదవుల మీది చిరునవ్వు మాత్రం మాయమయింది. బాధను లోలోపల బిగించుకున్నట్లు పెదవులు లోపలకు ముడుచుకున్నాయి

అమాయకంగా చూసే కళ్ళు ఆరాటంగా శూన్యంలో ఏదో వెతుక్కోసాగాయి

నాలోనూ ఆరాటం రగిలింది. ఈవిడ మానాన ఈవిడ సుఖంగా బ్రతుకుతోంటే లేనిపోని సంఘర్షణ ప్రవేశపెట్టానా?

ఇదివరకు పూవులు ఎవరైనా ఇస్తే ఇచ్చిందేచాలని పెట్టుకునే జ్ఞాన పూలు పెట్టుకోవటమే మానేసింది. పెళ్ళిళ్ళకూ పేరంటాలకూ అరువు చీరలతో ఆనందంగా వెళ్ళే వ్యక్తి పంతం పట్టినట్లు పాతచీరలతోనే తయారయ్యేది!

బ్రతుకు మీద కసితో తనను తానే హింసించుకొంటున్న ఆ దురదృష్టవంతురాలిని చూసి నా మనసు విల విల లాడేది! కాని, నేను మాత్రం ఏం చెయ్యగలను?

లిట్ క్విజ్ కొటేషనులన్నియు రచయితల రచనలనుండి గ్రహించబడినవి. అవి నేనికనే పూర్తి అర్థములు గలవి. ఒక్కొక్క క్లూకు మూడు పదములు అక్షర క్రమమున యేర్పాటుచేయబడినవి. మొదటి మూడు పదముల యొక్క అక్షర క్రమమున క్లూలన్నియు యేర్పాటుచేయబడినవి. లిట్‌క్విజ్ వీక్లీ అఫిషియల్ సొల్యూషనుతో రచయితల పేర్లు, వారి రచనల పేర్లు ప్రకటించబడును.

**ఏజెంట్లు :** క్యాష్ రశీదులు, ఎంట్రీ ఫారములు & లిట్‌క్విజ్ వీక్లీలు ఈ ఏజెంట్ల వద్ద లభించును.

**మద్రాసు :—** స్టార్ న్యూస్ ఏజెన్సీ, 186, బ్రాడ్వే కార్నర్.

**హైదరాబాదు :—** సెవన్ సీస్ (ఫోన్ నెం. 48180) 25, బహాదూర్‌పుర కాలనీ.

**నెం. 91 : 12 క్లూలు** (తెలుగు తర్జుమా)

1 మనం, అపార స్వతంత్ర సంకల్పములు గలిగి, ఉత్సాహకరంగాను దూరదర్శ పటిమతో మన వృత్తులను నియమించుకోగల ప్రాణులమని స్వయంగా మనమే తలంచుకొనుట మనకు ఇష్టం. కాని జీవనమందలి చిన్న చిన్న ఆకస్మిక ఘటనలు / సంఘటనలు మనం సమ్మతించ సిద్ధమగుట కంటె ఎక్కువగా మనదిశా నిర్ణయంలో ప్రాముఖ్యమును గలిగియున్నవి.

2 బహుదీర్ఘకాలంవరకు క్రింద మునిగిపోయినతరువాత మరల పైకి తలెత్తిన పురాతన మూల్యములందు వార్ధక్యం / కళ కోసం సమాదరణ మరియు శ్రద్ధ ఎంతసార్థకమో అంతహృదయస్పర్శకము అయివున్నది.

3 సౌందర్యం అవసరం కళలయొక్క జనని.

4 ప్రపంచంలో మనుష్యుడు ఎక్కడ దృష్టిని సారించునో అక్కడ సౌందర్యం / ఏకత్వం గలదు.

5. ఇప్పటికి సభ్యత / సంవిధానత స్వయం నిర్భరతను పొందలేదు.

6 వనితా స్థితి సర్వదా ఆశ్రితం / మిగులుపాటుపడు నదైయున్నంతవరకు ఆమె, సగటున తన స్థితియందు బాగుగ సంతుష్టిని జెందియుండును.

7 మరి భేదములకు / కర్తవ్యములకు ప్రాముఖ్యత నివ్వబడినప్పుడు వాటికి దూరంగా తొలగి తప్పించుకొనజూచుట వాటికి అట్లే ప్రాముఖ్యత నివ్వబడకపోయినా కూడా గొప్పగా ప్రకటించినట్లు వట్టి మూర్ఖత.

8 సమయం, స్థలంతో సంబంధించనిదే అర్థశాస్త్రము / నీతి శాస్త్రము యొక్క ఏ నియమములున్ను సర్వవ్యాపక సత్యము కానేరవు.

9 నిజాయితీ / మానవత ప్రతి జీవిత ధర్మములో భాగమై యున్నది. మరియు ప్రతి సుపరిపాలక రాష్ట్రం జాతి, లేక ప్రజకు పునాదియై వున్నది.

10. కల్పిత గాథలు / అసత్యములు దుర్భరం, ప్రత్యేకంగా అవి మిగుల క్షోభాయమానం లేక భయోత్పాతకర అయినప్పుడు.

11. క్రియారహిత ఆశావాదత / సమాజ వాదత మూర్ఖులకు ఒక తత్వజ్ఞానం.

12. శాంతి మరియు సంపన్నతాయుతమైన సుఖ దినములలోకంటె యుద్ధ లేక ఆర్థిక సంకటాల మధ్య అధిక తత్పరతతో ప్రణాళికను / దుఃఖ బాధితమును దేశములు ఏర్పరచ పూనుకొంటవి.

**No: 91—12 CLUES**

(1) We like to think ourselves creatures of boundless free will, carving our careers with vigour and foresight, but the little ACCIDENTS/INCIDENTS of life have more to do with our direction than we care to admit

(2) Of the old values which after long submergence have again come to the surface, esteem and reverence for AGE / ART is as a moving as it is significant.

(3) BEAUTY / NECESSITY is the mother of the arts.

(4) Wherever man turns his gaze in the universe, there is BEAUTY / UNITY.

(5) As yet no CIVILIZATION / CONSTITUTION has been self-supporting.

(6) So long as the woman's place is consistently that of a DEPENDANT/ DRUDGE, she is, in the average of cases, fairly contented with her lot.

(7) It is no use shirking DIFFERENCES/ DUTIES when they are emphasized just as it is foolish to magnify them when they are not.

(8) No laws of ECONOMICS / ETHICS are universally true without regard to time or place

(9) HONESTY / HUMANITY is a part of every surviving religion, and is the basis of every well-governed nation, tribe or people.

(10) LEGENDS / LIES die hard, particularly when they are sensational or shocking.

(11) OPTIMISM / SOCIALISM without action is a philosophy for fools.

(12) Nations take more readily to PLANNING/SUFFERING in times of war or economic crisis than in the palmy days of peace and prosperity.

**క్లూస్ డ్యూయెట్**

4వ కూపనులో ఆఖరు (11&12) రెండు క్లూలు మీరు కరెక్టుగా ఎన్నుకొనిన, క్లూస్ డ్యూయెట్ బహుమతి రు 20,000 యందు మీరు భాగం పంచుకొనగలరు.

# మహార్ఘత్వమే వరకమా?

వివాహం పేరిట ఆవిడ చిక్కుకున్న విష వలయంలోంచి బయట పడెయ్యటం ఎవరి తరం?

దురదృష్టమో, అదృష్టమో కాని జ్ఞానకు పిల్లలు కూడా లేరు!

అందరి పిల్లలనూ తన పిల్లలుగా చూసి పెంచి పెద్ద చేసిన జ్ఞాన తనకు పిల్లలు లేరని ఏనాడూ బాధ పడలేదు!

మొదటిసారిగా తనకు సంతానం లేనందుకు జ్ఞాన క్షోభించే అవసరం మా మరిది కల్పించాడు!

బ్రతుకులో మాధుర్యం తుళ్ళి విస్ఫారంగా గడిచిపోయింది. ఆస్తి పంపకాల విషయం వచ్చింది...

'వదినకు పిల్లలు లేరు! అన్నయ్య తదనంతరం ఆ ఆస్తి మళ్ళీ మాకే రావాలి! కావాలంటే వదినకు అర ఎకరమో, ఒక ఎకరమో ఇవ్వండి!' అని ఉదారంగా ప్రకటించాడు మా మరిది...

జ్ఞాన గుండె గుభిల్లుమంది! విషకీక్షగా తన బ్రతుకు!

'పిల్లలు లేకపోతే ఏమయ్యా! ఎవరినైనా పెంచుకుంటుంది.' జ్ఞాన తరఫున ఎవరో అన్నారు.

'ఎవరినో ఎందుకు పెంచుకోవాలి! మా నాన్నగారి ఆస్తి ఎవరికో పోనిస్తానా? కావాలంటే మా పిల్లల్లో ఒకడిని పెంచుకోమను!'

పట్టుపట్టాడు మా మరిది!

లీల తనకున్న ఇద్దరు కొడుకుల్లో ఒకణ్ణి వదులుకుంటుందా? ఆ పిల్లవాడికి మాత్రం లీల తన తల్లి అనీ,—జ్ఞాన పెద్దమ్మ అనీ తెలియదా? ఈ దత్తత జ్ఞానకు జరగవలసిన నిండరి అన్యాయం—ఆస్తి దక్కనీయక పోవటానికి తప్ప మరెందుకు?

లక్షణంగా మంత్ర ఘోషలతో దత్తత పూర్తయింది. జ్ఞాన మనసులో ఏముందో పైకేమీ అనలేదు,

ఆ తంతంతా ముగిసి పదిరోజులయినా కాలేదు! ఈ కబురు!

లీల గుండె పగిలేలా ఏడుస్తోంది. లీలను దగ్గిరకు తీసుకుని ఓదార్చాను.

'బాధపడకు. జ్ఞాన సంగతి మనకు తెలుసు, అంత రాక్షసంగా ఉండలేము—' అన్నాను.

# క్రొత్త సంవత్సర బంపర్

లిట్‌క్విజ్ నెం. 91 అధికార ఎంట్రీ ఫారము

మొత్తము బహుమతి. రు. 1,50,000/- ఆఖరు ముగింపు తేదీ 13-1-72 గురువారం

ADDRESS LITQUIZ No 91 ALANKAR BALARAM STREET BOMBAY 7

గమనిక:— 1. ఒక్కొక్క కాలంలో మీరు వద్దు పదమును కొట్టివేయండి. 2. ఒక కూపను మాత్రం పంపితవో ఇతర కూపనులను కొట్టివేయండి, 3. ఎంట్రీ రుసుము M.O. ద్వారా పంపితవో, పోస్టాఫీసునుండి పొందిన M.O. రసీదును ఎంట్రీ ఫారమునకు జతపరచవలెను. M.O. రసీదు లేని ఎంట్రీలు నిరాకరింపబడును 4. I.P.O. క్రాస్ చేయవద్దు. అది లిట్‌క్విజ్ నెం. 91 బొంబాయి—7 వారికి చెల్లించునట్లు ఉండవలెను.

| | 1 | Re. 1 | 2 | Re. 1 | 3 | Re. 1 | 4 | FREE |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | ACCIDENTS | INCIDENTS | ACCIDENTS | INCIDENTS | ACCIDENTS | INCIDENTS | ACCIDENTS | INCIDENTS |
| 2 | AGE | ART | AGE | ART | AGE | ART | AGE | ART |
| 3 | BEAUTY | NECESSITY | BEAUTY | NECESSITY | BEAUTY | NECESSITY | BEAUTY | NECESSITY |
| 4 | BEAUTY | UNITY | BEAUTY | UNITY | BEAUTY | UNITY | BEAUTY | UNITY |
| 5 | CIVILIZA- | CONSTITU- | CIVILIZA- | CONSTITU- | CIVILIZA- | CONSTITU- | CIVILIZA- | CONSTITU- |
| 6 | DEPENDANT | DRUDGE | DEPENDANT | DRUDGE | DEPENDANT | DRUDGE | DEPENDANT | DRUDGE |
| 7 | DIFFEREN- | DUTIES | DIFFEREN- | DUTIES | DIFFEREN- | DUTIES | DIFFEREN- | DUTIES |
| 8 | ECONOMICS | ETHICS | ECONOMICS | ETHICS | ECONOMICS | ETHICS | ECONOMICS | ETHICS |
| 9 | HONESTY | HUMANITY | HONESTY | HUMANITY | HONESTY | HUMANITY | HONESTY | HUMANITY |
| 10 | LEGENDS | LIES | LEGENDS | LIES | LEGENDS | LIES | LEGENDS | LIES |
| 11 | OPTIMISM | SOCIALISM | OPTIMISM | SOCIALISM | OPTIMISM | SOCIALISM | OPTIMISM | SOCIALISM |
| 12 | PLANNING | SUFFERING | PLANNING | SUFFERING | PLANNING | SUFFERING | PLANNING | SUFFERING |

| 91 | 5 | Re. 1 | 6 | Re. 1 | 7 | Re. 1 | 8 | FREE |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | ACCIDENTS | INCIDENTS | ACCIDENTS | INCIDENTS | ACCIDENTS | INCIDENTS | ACCIDENTS | INCIDENTS |
| 2 | AGE | ART | AGE | ART | AGE | ART | AGE | ART |
| 3 | BEAUTY | NECESSITY | BEAUTY | NECESSITY | BEAUTY | NECESSITY | BEAUTY | NECESSITY |
| 4 | BEAUTY | UNITY | BEAUTY | UNITY | BEAUTY | UNITY | BEAUTY | UNITY |
| 5 | CIVILIZA- | CONSTITU- | CIVILIZA- | CONSTITU- | CIVILIZA- | CONSTITU- | CIVILIZA- | CONSTITU- |
| 6 | DEPENDANT | DRUDGE | DEPENDANT | DRUDGE | DEPENDANT | DRUDGE | DEPENDANT | DRUDGE |
| 7 | DIFFEREN- | DUTIES | DIFFEREN- | DUTIES | DIFFEREN- | DUTIES | DIFFEREN- | DUTIES |
| 8 | ECONOMICS | ETHICS | ECONOMICS | ETHICS | ECONOMICS | ETHICS | ECONOMICS | ETHICS |
| 9 | HONESTY | HUMANITY | HONESTY | HUMANITY | HONESTY | HUMANITY | HONESTY | HUMANITY |
| 10 | LEGENDS | LIES | LEGENDS | LIES | LEGENDS | LIES | LEGENDS | LIES |
| 11 | OPTIMISM | SOCIALISM | OPTIMISM | SOCIALISM | OPTIMISM | SOCIALISM | OPTIMISM | SOCIALISM |
| 12 | PLANNING | SUFFERING | PLANNING | SUFFERING | PLANNING | SUFFERING | PLANNING | SUFFERING |

ఈ క్విజ్ ప్రవేశమునకు చెందిన నిబంధనలను, షరతులను పాటించుటకు అంగీకరిస్తున్నాను మరియు కాంపిటీషన్ ఎడిటరు గారి నిర్ణయమును తుది నిర్ణయముగాను, న్యాయబద్ధమైనదిగాను అంగీకరించుటకు ఆమోదిస్తున్నాను ప్రతి కూపనుకు ఎంట్రీ ఫీజు రు. 1/- ఈ పూర్తి ఎంట్రీ ఫారము (8 కూపనులకు) ఫీజు రు 6/- M O రసీదు / I. P. O. / లిట్‌క్విజ్ క్యాష్ రశీదు ప్రైజు కార్డు జతపరుస్తున్నాను. దాని నెం. .............. .....

నెం 92 ఫారములు పొందుటకై దీనిని పూర్తి చేయండి.

FULL NAME ...............................

..........................................

ADDRESS ...............................

..........................................

..........................................

POST ........................ DIST. .......

**91** (ASVP)

ఇంగ్లీషునందు పెద్ద అక్షరములలో వ్రాయండి

FULL NAME ...............................

..........................................

ADDRESS ...............................

..........................................

..........................................

POST ........................ DIST. .......

ఈ పూర్తి ఫారమును కత్తిరించి పంపవలెను

4 వ కూపను ఉచితము

గమనిక — ఇవన్నియు కొటేషనులు.. వీనికి రచయిత వాడిన పదములే సరియైన జవాబులు. ఆఫీషియల్ సొల్యూషన్ తేది 16—1—72 గల సండే స్టాండర్డ్ సిటీ ఎడిషన్ (కడపటి పేజీ) నందున్ను, బహుమతుల పట్టీ లిట్‌క్విజ వీక్లీ అడ్వాన్సు 23—1—72 యందును, పూర్తిగా కుదింపబడి తేదీ 23—1—72 సండే స్టాండర్డ్ నందును ప్రకటింపబడగలదు. వెంటనే సొల్యూషన్ పొందగోరువారు 10 పైసల స్వంత అడ్రసు గల పోస్టుకార్డును పంపగోరడమైనది.

క్రాస్-డ్యూయెట్

రు. 20000

# మహాత్యా మేపరమా?

'ఏమోనండీ! అక్కయ్యగారికి మామీద కోపంగా ఉంది—' అంది వేలగా...

'కోపం రావటం అసహజమా?'

మాట్లాడింది లీలఅయినా మామరిది ముఖం చూస్తూ సమాధానం చెప్పాను—

మరిది ముఖం తిప్పుకున్నాడు—లీల కళ్ళు తడుచుకుంది—అవి వెంటనే నిండుకున్నాయి—

'బెంగ పెట్టుకోకు! జ్ఞాన సంగతి మనకు తెలియదా? రెండు రోజుల్లోనే తప్పకుండా ఉత్తరం వ్రాస్తుంది—వెళ్ళి అన్ని సంగతులూ మాట్లాడుకో వచ్చు—' అని వచ్చేసాను...

రెండు రోజులు — వారం రోజులు—పదిహేను రోజులు—నెల రోజులు గడిచి పోయాయి—

జ్ఞానజాడ తెలీలేదు—అసలే సన్నగా ఉండే లీల చీపురుపుల్లలా అయిపోయింది—

లీల ఏమయిపోతుందోనని భయంవేసింది నాకు—మొట్టమొదటి సారిగా జ్ఞానమీద కోపంకూడా వచ్చింది.

లీలావాళ్ళ పనిమనిషి వగర్చుకుంటూ వచ్చింది—

'అమ్మగారు మిమ్మల్ని అర్జంటుగా రమ్మంటున్నారు! అంది—

హడలిపోయాను—ఉన్నదాన్ని ఉన్నట్లు బయలుదేరాను...

లీల నేలమీదపడి దొర్లిదొర్లి ఏడుస్తోంది—ఎవరో అపరిచిత వ్యక్తి కుర్చీలో కూర్చొని ఉన్నాడు— నన్ను చూడగానే 'అక్కయ్యా! మన రాజా...' అంటూ బావురుమంది లీల!

లీల వెక్కివెక్కి ఏడుస్తోందేగాని చెప్పలేకపోతోంది...

ఆ అపరిచితవ్యక్తి చెప్పాడు—

'రాజు అవసానదశలో ఉన్నాడమ్మా! చివరిచూపు అందుకోవాలంటే మిమ్మల్ని అర్జంటుగా రమ్మన్నారు జ్ఞానగారు!'

లీల మళ్ళీ ఘొల్లుమంది...

'అంత ఎలా ముంచుకొచ్చింది? అసలేం జబ్బు!' నాకూ ఏడుపొస్తున్నా ఎలాగో అడిగాను.

'ఏం చెప్పమంటారమ్మా! ముందు జ్వరం వచ్చింది— మందా? మాకా? అలా గాలికి వదిలేసింది — ఎక్కువైంది—టైఫాయిడ్‌లోకి దింపింది— అప్పటికి డాక్టర్‌ను పిలవలేదు! 'దత్తుచేసుకున్నంత మాత్రాన వాడు నాకొడుకవుతాడా?...ఎలాపోతేనాకేం?' అంది—మేం హాస్పిటల్లో చేర్పిస్తామన్నా వీలులేదంది—చివరికిప్పుడు... మీరు త్వరగా బయలుదేరాలి!...' నిర్ఘాంత పోయాను! జ్ఞాన ఇలా తయారయిందా? నేను ఆమెకు కలిగించిన విజ్ఞానం ఇందుకు దారితీసిందా?

లీల కుమిలిపోతోంది—ఆవిడను ఓదార్చటం ఎవరికీ సాధ్యం కావటంలేదు—

'అలా ఏడుస్తూ కూచుంటే ఏం లాభం? లే! లేచి బయలుదేరు!'

అన్నాడు మా మరిది దుఃఖంతో పూడుకుపోయిన గొంతుకతో ..

'ఇదంతా మీరు చేసిందే! దరిద్రపు ఆస్తికోసం బంగారంలాంటి బిడ్డ బలైపోయాడు!'

రోషంగా కసిరింది లీల!

నాకు తెలిసినంతలో ఆవిడ భర్తమాట కెదురు చెప్పటం అదే మొదటిసారి!

ఇంత దారుణమైన దెబ్బ తగిలాక కాని ఆమాత్రం భర్తకు నచ్చజెప్పవచ్చునని తోచలేదు! ఆయన చెప్పిన చిరునామాను బట్టి ఎలాగో అందరం జ్ఞాన ఇంటికి చేరుకున్నాం—

ఎలాంటి దృశ్యం చూడవలసి వస్తుందోనని అందరికీ కాళ్ళూ చేతులూ వణుకుతున్నాయి—

లీలను పట్ట శక్యంకావటం లేదు... మధ్యగదిలో కూర్చుని తాపీగా సిగ అలంకరించు కుంటోంది జ్ఞాన...

'అక్కయ్యగారూ! రాజా ఏడీ! నారాజును నాకు చూపించండి!'

జ్ఞాన కాళ్ళమీద వాలిపోయింది లీల— ఆ కాళ్ళను నెమ్మదిగా వెనక్కు తీసుకుంది జ్ఞాన...

'కూర్చో! కాఫీ కావాలా?'

అంత నిబ్బరంగా అడుగుతున్న జ్ఞానను చూస్తే ఒళ్ళు మండుకొచ్చింది నాకే!

'నారాజా! ... వాడిని చూపించండి? ఏడీ?'

'ఇంట్లోలేదు! హాస్పిటల్లో ఉన్నాడు— నీరాజా కాదు! నారాజా!'

'కాదు! కాదు! నీరాజా కాదు! నారాజా! నవమాసాలూ మోసి కన్నాను—ప్రాణాలన్నీ

పెట్టుకుని పెంచాను...'

'ఆస్తికోసం నాకు అమ్మావు...'

'కాదు! కాదు! కాదు!'

పిచ్చిదానిలా అరిచింది లీల...

'ఏ హాస్పిటల్లో చేర్చారో చెప్పండి ముందు రాజును చూడాలి!'

'నీరాజు కాదు! నారాజని ఒప్పుకో! అప్పుడు చెప్తాను!'

'నారాజు...నారాజు...'

ఏడుస్తోంది లీల...

'నీ ఆస్తి నువ్వు తీసేసుకో! నారాజును నాకిచ్చెయ్యి!'

జ్ఞాన తనకేం పట్టనట్లు లేచి కాఫీలు కలిపి అందరికీ అందించింది—

లీల తన కాఫీ ముట్టుకోలేదు...

'ఏ హాస్పిటల్? ఎక్కడ? ఏవండీ! పదండి! వెళ్లి ఊళ్లో ఉన్న హాస్పిటల్స్ అన్నీ చూసివద్దాం! నడవండి...'

భర్తను కుదిపేస్తోంది లీల—

మా మరిది జ్ఞానవంక అనుమానంగా చూస్తున్నాడు—నాకూ అనుమానం కలుగుతోంది—ఎంతైనా రాజు మరణశయ్య మీద ఉండగా ఇంత నిబ్బరంగా జ్ఞాన ఉండదు! ఉండలేదు...

చేతిలో రకరకాల బొమ్మలు పట్టుకుని శేషశాయితో కలిసి వచ్చాడు రాజు—

మమ్మల్ని చూసి ఆశ్చర్యపోయాడు ...

'అమ్మ! నాన్నగారు! పెద్దమ్మ! అంతా వచ్చారు! ఎప్పుడొచ్చారు?' అన్నాడు సంబరంగా ... అంతలో జ్ఞాన దగ్గరకి వెళ్ళి తను కొన్న బొమ్మలన్నీ చూపించ సాగాడు—

నాకు అంతా అర్థమయింది—

లీలకు తెరిచిన నోరు తెరిచినట్లే ఉంది.

'నా పని అయిపోయింది ఈవిడ విషయమంతా వివరించి ఈ కాస్త సాయం చెయ్యమంటే 'సరే!' అన్నాను—' అని కండువా దులిపి భుజం మీద వేసుకుని వెళ్ళిపోయాడు శ్రోత్రీయున—

లీల పిచ్చిదానిలా రాజుని దగ్గరకు లాక్కుని ఊపిరాడకుండా కౌగిలించుకుని ముద్దుపెట్టుకో సాగింది — రాజు ఉక్కిరిబిక్కిరయి విడిపించుకుని 'ఏవిటమ్మా!' అన్నాడు చిరాగ్గా.

'రాజూ! ఇంకెప్పుడూ నన్ను వదిలిపెట్టి ఉండకురా! నువ్వు లేకుండా నేను బ్రతకలేనురా!'

వాడు చిరాకుపడుతున్నా ఆర్తిగా కౌగిలించుకుని కన్నీళ్ళు పెట్టుకుంది లీల! దుర్భర దుఃఖం గడిచిన తరువాత కలిగిన ఉప్పెనలాంటి ఆనందంలో పొంగిన కన్నీళ్ళు...

'నా అదృష్టం బాగుంది కనీసం మెట్రిక్ పాస్ కాగలిగాను—ఎక్కడ పంతులమ్మ పని చేసినా పొట్టగడవక పోదు? మీ ఆస్తి వద్దు. మీ బిడ్డా వద్దు—తీసికెళ్ళండి!'

మరిది ముఖంలోకి తృణీకారంగా చూసి అంది జ్ఞాన...

అందరమూ ఆరోజే బయలుదేరాము — బయలుదేరే ముందు జ్ఞాన మెడచుట్టూ చేతులువేసి 'నువ్వూ రావా పెద్దమ్మా!' అన్నాడు రాజు—

చివ్వున కళ్ళలో నీళ్ళు చిమ్మగా చటుక్కున నిగ్రహించుకుని 'వస్తానురా! నిన్ను చూడకుండా ఎలా ఉంటాను! అప్పుడప్పుడు వస్తాను.' అంది జ్ఞాన—

'బిడ్డల తల్లివి— జ్ఞానకు అన్యాయం జరగనీయకు—' అన్నాను లీలతో రహస్యంగా...

మూర్ఖత్వం వరమా? కాదు! జ్ఞాన పొందిన విజ్ఞానం ఆమెను సంఘర్షణకు లోను చేసి ఉండవచ్చు! ఆమె మనసు విపరీతంగా మథనపడి ఉండవచ్చు—కానీ ఆ విజ్ఞానమే ఒక మాతృమూర్తి దుఃఖాన్ని చూడలేక తన హక్కు త్యాగం చెయ్యగలిగే శక్తి నిచ్చింది—

తనను సర్వనాశనం చెయ్యాలనుకున్న వారి బిడ్డను అపురూపంగా లాలించి బుజ్జగించే మమత నిచ్చింది...

బాధలతో నైనాసరే! మనిషి మనిషిలా బ్రతకాలి!

తరువాత మా మరిది బావగారి ఆస్తిని వాళ్ళకు స్వాధీనం చేసినట్లు తెలిసింది —

తన పాతివ్రత్యాన్ని కొద్దిగా తగ్గించుకుని లీల కూడా భర్తతో ఒక్క మంచి పని చేయించ గలిగింది.

ధన్యురాలు జ్ఞాన! ●



# 1971 లో చలనచిత్ర పరిశ్రమ!

## క్రయిమ్ విజృంభణ

'1971 లో చిత్ర పరిశ్రమ అజీర్తి వ్యాధితో బాధపడింది. ఎక్కువ చిత్రాలు విడుదలై, వసూళ్లని పంచుకుని, ఏ ఒక్క నిర్మాతకి సరయిన వాటాని తెచ్చిపెట్టలేక పోయింది. క్రయిమ్ చిత్రాల విడుదల అధికంగా కనిపించినా, ప్రేక్షకుల ఆదరణ తక్కువగా లభించింది. డబ్బింగు రేటు (యితర భాషల తర్జుమాకి) మాత్రం ప్రారంభంలోనే వచ్చేస్తుంది. క్రయిమ్ (చిత్ర) నిర్మాతలకి అయినా, కొత్త నిర్మాతలు అలాంటి కథలనే ఎన్నుకుంటున్నారు.'

## కలర్ క్రేజ్

'కలర్ చిత్రాలపై ప్రజలు మోజు పడుతున్నట్టు 'దసరా బుల్లోడు', 'ప్రేమనగర్' నిరూపించాయి. కృష్ణ హాలీవుడ్ బాణీ చిత్రాన్ని నిర్మించి, విజయుడయ్యారు. 'దసరా బుల్లోడు' తిరుపతిలో 260 రోజులు హౌస్‌ఫుల్ బోర్డ్ పోకుండా ప్రదర్శింపబడింది.'

## నవలలకి గిరాకీ

'తెలుగు నవలలకి ప్రజాదరణ వుంది అని 'ప్రేమనగర్', 'విధి విన్యాసాలు' (తాసిల్దారుగారి అమ్మాయి) చిత్రాలు ఋజువు చేశాయి. శోభన్‌బాబు ప్రప్రథమంగా ద్విపాత్రాభినయం చేసి కృతకృత్యుడయ్యారు.'

* * *

'నటి సంధ్య (జయలలిత తల్లి) తన 42వ యేట అకాలమరణానికి గురి అయింది. ప్రముఖ వంగ దర్శకుడు దేవకీ బోస్ దివంగతుడయ్యారు.'

## ఘనంగా పెళ్ళిళ్ళు

'నట సామ్రాట్ నాగేశ్వరరావుగారి కుమార్తె పెండ్లి, నటరత్న రామారావుగారి కుమారుని పెండ్లి హైదరాబాదు, మద్రాసు నగరాల్లో వైభవోపేతంగా జరిగాయి. నటి లక్ష్మికి కుమార్తె పుట్టింది. ప్రముఖ కథానాయిక వాణిశ్రీ బ్యాటరీ ఫ్యాక్టరీకి యజమానురాలయింది.'

## '71లో కొత్త విషయాలు

'సెక్సీ తారగా పేరెన్నికగన్న జ్యోతిలక్ష్మి కథానాయిక అయింది. 'రౌడీ రాణి' ఫేమ్ విజయలలితకి హిందీ స్టార్‌డమ్ వచ్చింది. విజయవంతమైన నిర్మాతగా వుండిన జగపతి రాజేంద్రప్రసాద్, ప్రతిభావంతుడైన దర్శకుడు అని 'దసరాబుల్లోడు' ద్వారా నిరూపించారు. పెద్దతారల చిత్రాల కన్నా, శోభన్, కృష్ణలు నటించిన చిత్రాలే మాత్రం తీసిపోవు అన్న సత్యం బయట పడింది. పత్రికా రచయిత వాశిరాజు ప్రకాశం నిర్మాత అయ్యారు. కొంతకాలం అజ్ఞాతవాసం గడిపిన రాజసులోచనకి తెలుగు చిత్ర పరిశ్రమలో సముచితస్థానం లభించింది. ఎన్టిఆర్ కృష్ణుడిగా నటించిన 'శ్రీకృష్ణవిజయము'తో 1971 ప్రారంభమై, రామారావు అదే పాత్రను నిర్వహించిన 'శ్రీకృష్ణ సత్య'తో సంవత్సరం అంతమైంది. రెండిటిలోనూ జయలలిత ఉండటం ఒక విశేషం.'

## ప్రత్యేక ప్రతిభ

'ప్రేమనగర్'లో వాణిశ్రీ, 'బంగారు తల్లి'లో జమున, 'తాసిల్దారుగారి అమ్మాయి'లో చంద్రకళ నటనకు అన్ని తరగతుల ప్రేక్షకుల ప్రశంసలు లభించాయి.

* * *

'ప్రేమనగర్'లో నాగేశ్వరరావు, 'శ్రీకృష్ణ సత్య'లో రామారావు, 'తాసిల్దారుగారి అమ్మాయి'లో శోభన్, 'మోసగాళ్ళకు మోసగాడు'లో కృష్ణ, 'చెల్లెలి కాపురం'లో నాగభూషణం, 'పవిత్ర హృదయాలు'లో గుమ్మడి నటన్ను ప్రజలు మెచ్చుకున్నారు.

## 72 కి సూచన

'1971 పరిశ్రమకి నిరుత్సాహాన్ని కలిగించినా, నిర్మాతలు మాత్రం చిత్రాలను నిర్మించే ప్రయత్నాల్లోనే నిమగ్నులై వున్నట్టు తెలుస్తోంది. అంటే 1972 కూడా గడ్డు సంవత్సరంగా వుంటుందనేగా! చిత్రాల విడుదల రద్దీ తగ్గాలి. డిస్ట్రిబ్యూటర్ల మధ్య సామరస్యం కుదరాలి. నిర్మాతల్లో అభిరుచి పెరగాలి. అప్పుడే పరిశ్రమ సుభిక్షంగా వుంటుంది.'

—శ్రీనివాస్



'భార్యాబిడ్డలు'లో నాగేశ్వరరావు, జయలలిత, డాలీ, కృష్ణకుమారి. 'ప్రేమించిన వనిత, కట్టుకున్న భార్య, కన్నబిడ్డ సమస్య ఎలా పరిష్కారం అవుతుంది ?'



'జగత్ జెంత్రీలు'లో శోభన్‌బాబు, వాణిశ్రీ

**చిత్రసమీక్షలు:**

# జగత్ జెంత్రీలు

గంగారాం ముఠా దోపిడీలు, దొంగతనాలు విచ్చలవిడిగా చేస్తుంటారు. ఒక రోజు సినీతార శోభ యింట్లో—ఆమె పుట్టినరోజున నాట్యం జరుగుతున్నపుడు, ఆమె యింటిలోని నగలపెట్టెను అపహరించుకుపోతారు గంగారాం అనుచరులు. వారినుంచి ఆ పెట్టెను రూపసి అనే అందాల పడుచు మోటారు సైకిలు మీద వచ్చి కొట్టేస్తుంది. పోలీసులు వెంటాడి ఆమెను పట్టుకుంటారు.

రూపసి ప్రజ్ఞను గురించి విన్న గంగారాం—ఆమెను తమ ముఠాలో చేర్చుకోవాలనే సంకల్పంతో జైలునుంచి తప్పించి తీసుకురమ్మని తన అనుచరులకు పురమాయిస్తాడు. రూపసి గంగారాంతో చేతులు కలిపి అతనితో భాగస్వామి అవుతుంది.

రాజా రఘువీరసింహ దగ్గర అంతులేని నిధి నిక్షేపాలున్నాయని తెలుసుకుంటాడు గంగారాం. రూపసి సహాయంతో రాజాను పట్టి తమ మకాంలోకి తీసుకొచ్చి నిర్బంధంలో ఉంచుతారు. నిధి రహస్యం చెప్పమని వేధిస్తూ ఉంటారు.

ఈ దుండగుల చర్యలు అరికట్టడం కోసమని ప్రభుత్వం భారత్ అనే సి.ఐ.డి.ని పంపిస్తుంది. వెదుకబోతున్న తీగ కాలికి తగిలినట్లు—గంగారాం ముఠా ఆచూకీకోసం ప్రయత్నిస్తున్న భారత్‌కి రూపసి తగులుతుంది. అతన్ని గంగారాం మకాంకు తీసుకువెళుతుంది.

అక్కడ భారత్ ఏం చూశాడు? రూపసి ఎవరు? గంగారాం ఉచ్చులోంచి భారత్ తప్పుకోగలిగాడా? రాజా ఏమయ్యాడు?...

ఆద్యంతమూ ఉత్కంఠ రేకెత్తించే కథా సంవిధానంతో రూపొందించబడిన యీ క్రైమ్ చిత్రంలో భారత్‌గా శోభన్‌బాబు, రూపసిగా వాణిశ్రీ, గంగారాంగా ప్రభాకరరెడ్డి, రాజా రఘువీరసింహగా పి. వెంకటేశ్వరరావు, సీసీ డి. రాజబాబు, సినీతార శోభగా రమాప్రభ, రాజా కూతురు శాంతిగా రేణుక నటించారు. త్యాగరాజు, విజయభాను, సా. శివరామకృష్ణయ్య, కె.కె. శర్మ ప్రభృతులు యితర భూమికలు పోషించారు.

సహకార దర్శకత్వం వహించిన దాసరి నారాయణరావు యీ చిత్రానికి కథ, మాటలు రాశారు. సంగీతం: కోదండపాణి, కూర్పు: ఎన్. ఎస్. ప్రకాశం, కెమెరా కన్నప్ప, దర్శకత్వం: పి. లక్ష్మీదీపక్.

శ్రీయుతులు పి. వెంకటేశ్వరరావు, కె. రాఘవ నిర్మించిన యీ చిత్రం ఆంధ్రప్రదేశ్ అంతటా లక్ష్మీ ఫిలింస్ ద్వారా డిసెంబరు 30న విడుదలవుతుంది.

—మోహన్‌కుమార్

# సినిమా

## నాయకునికి నిర్మాత అభినందన!

'హ్యాట్స్ ఆఫ్ టు హిమ్' అన్నారు విఠలాచార్య. 'ఎవరికంటి?' అని అడిగారు. 'నటసామ్రాట్ నాగేశ్వరరావు గారికే' అన్నారు ఆచార్య, 'బీదలపాట్లు కథానాయకుడిగా ఆయన అద్భుతంగా నటించినందుకే. ఈ చిత్రాన్ని తన స్వంతచిత్రంగా భావించి, ఆయన ప్రతి షాటు, సన్నివేశానికి ప్రాణ ప్రతిష్ఠ చేశారు. మేము ఒక్క నిమిషం కూడా వేస్టు కానీకుండా, సెట్సు పై పని చేసాము. నాగేశ్వరరావుగారు ఉదయం 9 గంటలకి వస్తే, రాత్రి 9 వరకు ([illegible]) చాలా హుషారుగా వుంటూ, సాటి నటీనటులకి, టెక్నీషియన్సుకి ఉత్సాహాన్ని కలిగిస్తూ, ఒక హోమ్లీ వాతావరణాన్ని సృష్టించటంవల్ల మేము అనుకున్నదానికన్నా ముందుగా పని పూర్తి అయ్యేందుకు దోహదం చేసినందుకు ఆయన్ను మనసారా అభినందించాలి. గర్వమూ, బేషజమూ ఆయనకి లేదు. లైట్‌బాయ్‌ని కూడా పలకరించే స్వభావం ఆయనది. నేను నాగేశ్వరరావుగారితో పని చేసింది యిదే ప్రథమం అయినా, ముందు ముందు ఆయనతో పని చెయ్యాలనే నిర్ణయం నా మనస్సులో గట్టిగా నాటుకుపోయింది' అని అక్కినేనితో తన అనుభవాన్ని గురించి విఠలాచార్య వివరించారు.

విఠలాచార్యకి 'బీదలపాట్లు' ప్రెస్టేజి చిత్రం అనే చెప్పాలి. ఆయన ప్రెస్టేజిని కాపాడేందుకు డి. వి. నరసరాజుగారు కలం, వెంకటరత్నం ఛాయాగ్రహణం, మహాదేవన్ సంగీతం శాయశక్తులా కృషి చేస్తే, నాగేశ్వరరావు తన సహజనటనా కౌశలంతో జీవం పోసారు. చిత్రంలో కనిపించే ముఖ్యపాత్రలను గుమ్మడి, సత్యనారాయణ, రాజబాబు, రావు గోపాలరావు, చంద్రకళ, విజయలలిత, సూర్యకాంతం ప్రతిభావంతంగా పోషించారు. అన్నపూర్ణ విడుదల

## అర్జునుడిగా క్రిష్ణ

జేమ్స్‌బాండ్ వేషాలకు తనకు తనే సాటి అని 'ప్రజలచే, పరిశ్రమచే ప్రశంసింపబడుతున్న హీరో క్రిష్ణ పాండవ మధ్యముడిగా ఒక సాంఘిక చిత్రంలో నటిస్తున్నారు సాంఘికంలో అర్జునుడా! అని మీరు ఆశ్చర్యపడవచ్చు అవును డి బి ఎన్ ప్రొడక్షన్స్ వారి 'అబ్బాయిగారు — అమ్మాయిగారు' చిత్రంలో ఒక వీధినాటకం జరుగుతుంది ఆ నాటకంలో క్రిష్ణ అర్జునుడి వేషాన్ని ధరిస్తారు.

## పౌరాణిక నాటకంద్వారా ఫ్యామిలీ ప్లానింగ్!

పౌరాణిక నాటకంద్వారా ఫ్యామిలీ ప్లానింగ్ ప్రచారాన్నికూడా పాత్రధారులు సలపడం యీ చిత్రంలోని మరొక విశేషం నాయకుడు క్రిష్ణతో నాయిక వాణిశ్రీకి పరిచయం యేర్పడేదికూడా యీ నాటకం రోజే ఆద్యంతం కడుపుబ్బ నవ్వించే ఇంగా షట్టం ముఖ్యకథకి ఆయువుపట్టయిన మలుపును తెస్తుందని తెలుస్తూంది

'అబ్బాయిగారు—అమ్మాయిగారు' కథను ముళ్ళపూడి వెంకటరమణ వ్రాయగా, మాటలను మద్దిపట్ల సూరి సమకూర్చారు వి రామచంద్రరావు దర్శకత్వం నెరపుతున్న యీ చిత్రానికి మహదేవన్ సంగీతాన్ని క్రిష్ణ ఛాయను, జైహింద్ సత్యం స్టిల్సును, వెంకన్నబాబు ప్రొడక్షన్ను నిర్వహిస్తున్నారు డి బి నారాయణ నిర్మిస్తున్న యీ సముజ్వల సాంఘికంలో వాణిశ్రీ, క్రిష్ణ, గీతాంజలి, పద్మనాభం, అల్లు రామలింగయ్య, రమాప్రభ, సాక్షి రంగారావు, పుష్పకుమారి, గుమ్మడి(గెస్టు) ధరిస్తున్నారు ఈ చిత్రం పదివేల అడుగులు తయారైంది జనవరిలో అవుట్‌డోర్ షూటింగు వుంటుంది

## మానవుడు— దానవుడుగా శోభన్

'తాసిల్దారుగారి అమ్మాయి' చిత్రంలో తండ్రి తనయుడిగా శోభన్ అపూర్వంగా నటించారు 'మానవుడు—దానవుడు' చిత్రంలో శాంతమూర్తిగా, దుర్మార్గుడిగా బాగా నటిస్తున్నారని తెలిసింది శోభన్‌బాబు ద్విపాత్రాభినయం చెయ్యబోయే మరొక చిత్రం జూన్‌లో ప్రారంభం కానున్నట్టు, ఆయన యిటీవల నాతో చెప్పారు

## అయిదవ చిత్రం అక్కినేని హీరో

మంచి చిత్రాలను నిర్మించే కొద్ది సంస్థల్లో రవీంద్రా ఆర్ట్ పిక్చర్స్ ఒకటి. ఈ సంస్థ మూడు చిత్రాలను నాగేశ్వరరావుతో నిర్మించి, నాలగవ చిత్రాన్ని శోభన్‌తో నిర్మించి, నాలిగింటిలోనూ కృతార్థులై, ప్రజాభిమానాన్ని సంపాదించిన విషయం పాఠకులకు తెలిసిందే ఇప్పుడు అక్కినేనితో రవీంద్రా ఆర్ట్ పిక్చర్స్ తమ అయిదవ చిత్రాన్ని ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మిస్తున్నారు మూడు షెడ్యూళ్ల పని కూడా పూర్తయింది వాణిశ్రీ నాయిక రవీంద్రా కృష్ణమూర్తిగారి కుమారుడు లెనిన్‌బాబు దర్శకుడు

## ఆరవ చిత్రంలో శోభన్ ద్విపాత్రాభినయం

రవీంద్రా ఆర్ట్ పిక్చర్స్‌వారి 'ప్రొడక్షన్ నెం 6' జూన్‌లో సెట్స్‌కి వెళ్తుందట. ఈస్ట్‌మన్ కలర్‌లో వారిచేత నిర్మించబడే యీ చిత్రంలో శోభన్ ద్విపాత్రాభినయం చేస్తారట లెనిన్‌బాబు దర్శకత్వాన్ని చేపడతారట

సెట్సుపై లెనిన్‌బాబు చాలా చురుకుగా, హుషారుగా, ఉత్తేజకరంగా వుంటారని, మంచి అనుభవశాలివలె కనిపిస్తారని, రవీంద్రా ఆర్ట్స్ వారి అయిదవ చిత్రంలో నటించే తారాగణంద్వారా తెలుసుకున్నాను భవిష్యత్తువున్న దర్శకుడు— లెనిన్‌బాబు

## దర్శకుని ఊహాసంపత్తి

'శ్రీదేవి' చిత్రం చూసిన ప్రతి వ్యక్తి దర్శకుడి వూహా సంపత్తిని మెచ్చుకోక పోరు. ముఖ్యంగా ఈ చిత్రంలో కనిపించే కారు పాట చిత్రీకరణపై రెండు అభిప్రాయాలు కలగవు. సుపర్బ్ అని చెప్పి తీరాల్సిందే. ఈ దర్శకుడ్ని తమిళ రంగం ఆదరించినంతగా తెలుగు రంగం ఆదరించలేదు ఒకప్పుడు. కానీ యిప్పుడు ఆయన కోసం తిరిగేవాళ్ళు ఒక్కరా, యిద్దరా!

గోల్డెన్ పిక్చర్స్ వారి 'అత్తను దిద్దిన కోడలు'కి ఆయనే దర్శకుడు. ఆ చిత్రం చూస్తే, ఆద్యంతం డైరెక్టరే కనిపిస్తాడు: రవిశంకర్ ఫిలిమ్స్‌ని కూడా ఆయనే డైరెక్ట్ చేస్తున్నారు.

## అభిరుచికి తగిన చిత్రం

దర్శకుడిగా పేరు గడించిన బి ఎన్. ఎన్ కి నిర్మాత కావాలనే తలంపు



"మొనగాడొస్తున్నాడు, జాగ్రత్త!" అందుకే కృష్ణని మంచిచేసుకుంటున్నావా రాజయిలోచన ?

1969లోనే కలిగింది. ఆ కోరిక 1971లో నెరవేరింది. మహావిష్ణు ప్రొడక్షన్స్‌ను స్థాపించి 'ప్రియ బాంధవి'ని తెరకెక్కిస్తున్నారు. తమ టేస్టు ప్రకారం చిత్రం తీయాలనే తలంపుతోనే నిర్మాత అయినట్లు బి. ఎస్. నారాయణ నాతో అన్నారు.

'ప్రియబాంధవి' నాయిక వాణిశ్రీ; నాయకుడు క్రిష్ణ; ప్రతినాయకుడు నాగభూషణం; అతనికి సహాయకుడు క్రిష్ణంరాజు; హాస్యనటుడు రాజబాబు; అతగాడికి జంట సంధ్యారాణి; వ్యాంప్ పాత్రధారిణి రాజసులోచన. ఉపనాయిక శుభ. ఒక ముఖ్య పాత్రధారి రామమోహన్. రచన్ను



'కొరడారాణి' జ్యోతిలక్ష్మి

బొల్లిముంత, ఛాయను రామక్రిష్ణారావు, సంగీతాన్ని వెంకటేష్, ఎడిటింగు క్రిష్ణ నిర్వహిస్తున్నారు. స్క్రీన్‌ప్లే, దర్శకత్వం: బి. ఎస్. ఎన్.

## ప్రజాదరణ పొందిన ప్రేమనగర్

సురేష్ మూవీస్ ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించిన 'ప్రేమనగర్' 1971లో 'దసరాబుల్లోడు' వలె విజయాన్ని సంపాదించిన చిత్రమైంది. చిత్రం 5 రీళ్లు అయినప్పుడే నిర్మాత రామానాయుడు తన చిత్రం అయిందారు కేంద్రాల్లో వందరోజులు పోకపోతే, చిత్రనిర్మాణం మానుకుంటాను అన్నారు. కాని 'ప్రేమనగర్' ఆయన ఆశించిన దానికన్నా ఎక్కువగా ప్రజాదరణ పొందింది.

'ప్రేమనగర్' తమిళ చిత్రం జనవరిలో

# సి ని మా

డిటెక్టివ్ నవలా రచయితగా విశేషను భవం గడించిన క్రిష్ణమోహన్ 'కొరడా రాణి'కి కథ, మాటలను సమకూర్చారు. సంగీతాన్ని సత్యం, ఛాయను దేవరాజు నిర్వహించే 'కొరడా రాణి' అతి త్వరలో విడుదల కావడానికి వురకలు వేస్తూంది.

## ఇంగ్లీషు చిత్రంలో జ్యోతిలక్ష్మి

గుట్టుచప్పుడు గాకుండా నాలుగు చిత్రాలను నిర్మించి, ప్రజలను మెప్పించి పరిశ్రమలో తన కొక సుస్థిర స్థానాన్ని యేర్పరచుకున్న నిర్మాత వై. వి. రావ్ ఇప్పుడు ఆయన ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించిన 'మొనగాడొస్తున్నాడు, జాగ్రత్త' హాలివుడ్ చిత్రాలను తలదన్నే విధంగా వుందని తెలిసింది.

రవిచిత్ర వారి తదుపరి చిత్రం ఇంగ్లీషులో కూడా నిర్మింప బడుతూందట. కృష్ణ, జ్యోతిలక్ష్మి నటిస్తారు.

## నవరసాలు పోషించే నాయకుడిగా చలం

'సత్తెకాలపు సత్తెయ్య' విడుదల అనంతరం చలం ప్రజల అభిమాన నాయకుడు అయ్యారు. 'సంబరాల రాంబాబు' విడుదల అవడంతో చలం గుణచిత్ర నటుడు అయ్యారు. 'మట్టిలో మాణిక్యం' తో చలం బాక్సాఫీస్ హీరో అయ్యారు 'బొమ్మా—బొరుసా' రావడంతో చలం మినిమమ్ గ్యారంటీ రన్నర్ అయ్యారు. దీన్నిబట్టి ఏం తెలుస్తుంది? చలం దిన దిన ప్రవర్ధమానమవుతున్నారు అని తెలుస్తుంది గదూ!

శ్రీ రమణచిత్ర నిర్మించిన 'బుల్లెమ్మ—బుల్లోడు' చిత్రంలో కొత్త చలం కనిపిస్తారు. ఇంతవరకు ఆయన ధరించిన పాత్రలకి, యీ చిత్రంలోని పాత్రకి హస్తిమశకాంతరం తేడావుంది నవరసాలు నిండిన నాయకుడిగ చలం చూపిన నటన 'బుల్లెమ్మ—బుల్లోడు' కి హైలైటు అని చెప్పవచ్చు.

## మీకు తెలుసా?

హీరో కృష్ణ ఒక సాంఘికంలో అర్జునుడిగా (పాండవ మధ్యముడు) నటిస్తున్నారు

నటి చంద్రకళకి కొంకణి, మరాఠీ, కన్నడం, తెలుగు, తమిళం, హిందీ, ఇంగ్లీషు భాషల్లో మంచి ప్రవేశం వుంది.

నటి శారద దెబ్బతిన్న ఒక వున్నత కుటుంబానికి ప్రతి నెలా కొంత సహాయాన్ని అందిస్తూందట.

నటి జయంతి ప్రముఖ హీరో రామారావుతో నాయికగా నటించబోతూంది

'పున్నమి' చిత్రంలో జయంతి నటన్ను మెచ్చుకుంటూ, రోజుకి వెయ్యి ఉత్తరాలు వస్తున్నాయట.

ప్రముఖ నటి వాణిశ్రీ సుమధురంగా పాడుతుంది కూడా!

'పెళ్ళిరోజు' చిత్రానికి సంగీత సారథ్యం వహించిన శ్రీరామ్ యిప్పుడు అదే సంస్థకి దర్శకుడు కూడా అయ్యారు.

## నాయికలు ఇద్దరు!

'బుల్లెమ్మ—బుల్లోడు' కథలో నాయికలిద్దరు వున్నారు ఒకదాన్ని విజయలలిత, మరొకదాన్ని విజయనిర్మల పోషించారు. అంటే చలం ద్విపాత్రాభినయం చేసారా ? అని మీరడగొచ్చు. నాకు తెలిసినా నేను చెప్పకూడదు. త్వరలోనే మీరు చూస్తారుగా. దుష్టపాత్రలను సత్యనారాయణ, ధూళిపాళ ధరించారు సహాయ భూమికలను సాక్షి రంగారావు, పిక్కలినేని, ముక్కామల సూర్యచంద్రరావులు నిర్వహించారు సంగీతాన్ని సత్యం, ఛాయను మధు, ఎడిటింగును అంకిరెడ్డి గమనించిన యీ చిత్రం సంక్రాంతి కానుకగా శ్రీ ఫిలింస్ ద్వారా విడుదల అవుతుంది.

శ్రీ రమణచిత్ర వారి తదుపరి చిత్రం 'వూరికి వుపకారి' ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించబడుతుందని తెలుస్తూంది.

## భారతీయ నిర్మాతలచే నిరాకరించబడిన భుట్టో

ప్రస్తుతం పాకిస్తాన్ అధ్యక్షుడు, సైనిక పరిపాలనాధికారి అయిన శ్రీ జుల్ఫికారాలీ భుట్టో ఒకప్పుడు సినిమాలలో వేషాలకోసం బొంబాయి స్టుడియోల చుట్టూ తిరిగారనే వార్తని 'సినీ ఎడ్వాన్స్' ప్రచురించింది భారత పాకిస్తాన్ విభజన సమయంలో శ్రీ భుట్టో లార్కానానించి బొంబాయికి తమ మకాం మార్చారు. ఆ రోజుల్లో హిందీ తెరమీద మకుటం లేని మహారాణిగా వెలుగుతున్న ప్రముఖ



పాకిస్తాన అవశేషానికి అధ్యక్షుడు, సైనిక పాలకుడుగా నియమితు డయిన జుల్ఫికారాలీ భుట్టో

తార నర్గీస్ అంటే ఆయనకి విపరీతమైన అభిమానమట. ఆమె చిత్రాల షూటింగ్ ఎక్కడ జరుగుతున్నా అక్కడ శ్రీ భుట్టో విధిగా హాజరవటమే కాకుండా వాటిలో నటించాలనే ప్రయత్నం కూడా చేశారట. కానీ భారతీయ చిత్ర నిర్మాతలు ఆయనలోని నటనాశక్తిని అంచనాకట్టలేక నిరాకరించారట. కాని ఆయనలోనిబిడీకృతమై ఉన్న సహజమైన వాక్చాతుర్యం, నటనా వైదుష్యం తర్వాత ఆయన రాజకీయరంగంలో బాగా ఉపయోగపడ్డాయని కూడా ఆ పత్రిక రాసింది.

—శ్రీనివాస్

అక్షరశుద్ధిని—కంఠస్వరమూ, గాన మాధుర్యమూ ముఖ్యమని ఘంటసాల వారి తాత్పర్యం!

శ్రీ ఘంటసాలదగ్గర దగ్గరగా పదివేల పాటలు పాడారు. నూరు ఎందచిత్రాలకు సంగీత దర్శకత్వం వహించారు దేశంలో ఆయన పాటని వినని వారు లేరు ఆయన పేరు తెలియనివారు లేరు. సంగీత రంగంలో ఇరవయ్యైదు ఏళ్ల అనుభవం తర్వాత ఈ మధ్య అమెరికాను పర్యటించి వచ్చారు. మూడు వారాలపాటు కచ్చేరీలు చేసి వచ్చిన శ్రీ ఘంటసాల పర్యటనని అమెరికాలోని తెలుగు సాంస్కృతిక సంఘంవారు ఏర్పాటు చేశారు.

'రఘుపతిరాఘువ రాజారాం' 'హరేరామహరేకృష్ణ' ఈ రెండు పాటలు అమెరికా ప్రజల్ని వెర్రెత్తించేశాయని ఘంటసాల చెప్పారు. అమెరికలో భారతీయ సంగీతం ఒహ్హళి ప్రచారం పొందుతున్నట్టుగా ఆయన భావించారు. భారతీయ రికార్డులు అమెరికా ప్రజల్ని బాగా ఆకర్షిస్తున్నాయని, మన బాణీలను వారు అనుసరిస్తున్నారని మన సంగీతం గురించి తెలుసుకోవాలని వారు అభిలషిస్తున్నారని శ్రీ ఘంటసాల అనుభవపూర్వకంగా తెలుసుకున్నారు. మనసంగీతం పట్ల అమెరికా ఉత్సాహాన్ని గమనించారు గనకనే ఘంటసాల మళ్ళీ అమెరికా పర్యటించాలని, మరిన్ని కచేరీల చెయ్యాలని, మన సంగీతాన్ని ప్రచారం చెయ్యాలని కోరుకుంటున్నారు. ప్రాచ్య పాశ్చాత్య సంగీత సాంప్రదాయాలకు సేతువు నిర్మించాలనే ఘంటసాలగారి ఔదార్యం నెరవేరుతుందనే ఆశిద్దాం!

## మచిలీపట్టణం అడ్వకేట్స్ ఫైన్ ఆర్ట్స్ అసోసియేషన్ వారి కదంబ కార్యక్రమం

ఈ మధ్య మచిలీపట్టణం అడ్వకేట్సు ఫైన్ ఆర్ట్సు అసోసియేషన్ వారు కృష్ణాజిల్లా జడ్జి శ్రీ ఉ. సేతుమాధవరావుగారి అధ్యక్షతన ఒక కదంబ కార్యక్రమము నిర్వహించారు అందులో సితార్, మిమిక్రి, 'సహాధిలో బంతిపూలు' నాటిక ప్రదర్శింపబడినవి.

(ఉ. వి.)

✦ ✦ ✦

బొబ్బిలిలో 4వ జాతీయ గ్రంథాలయ వారోత్సవం మునిసిపల్ చైర్మన్ శ్రీ చెలికాని వెంకటరావు గారి అధ్యక్షతను స్థానికవైశ్యభవనములో—బ్రహ్మాండంగా జరిగింది

(ఉ. వి.)

✦ ✦ ✦

నాగార్జునసాగర్ క్లబ్ ఆధ్వర్యంలో హిల్ కాలనీలోని రంగనాథ రంగశాలలో మదరాసు భరత విద్యాలయం వ్యవస్థాపకులైన శ్రీమతి వసంత లక్ష్మి కూచిపూడి, భరత నాట్య రీతులలో నృత్య ప్రదర్శనం యిచ్చారు. ప్రదర్శనానంతరం నాగార్జున సాగర్ ఛీఫ్ ఇంజనీరు గారి సతీమణి శ్రీమతి రామలక్ష్మి కృష్ణారావు కళాకారులని అభినందన పూర్వకంగా సన్మానించారు.

—(ఉ. వి.) ●



# రానున్న ఎలాంటి విపత్తునయినా ఎదుర్కొనేందుకు దేశం సిద్ధంగా ఉండాలి!—జగ్గయ్య



కిందటి వారం సౌభాగ్య కళాచిత్ర వారి 'శభాష్ పాపన్న' వర్ణ చిత్రం సెట్స్‌లో ప్రముఖ నటుడు శ్రీ జగ్గయ్యను కలిసినపుడు యుద్ధంపై మీ ఉద్దేశ్యమేమిటి ?' అని అడిగాను అందుకాయన సమాధానం చెబుతూ 'జరిగింది న్యాయమైన యుద్ధమే! భారత రక్షణ బలాన్ని ఎవరైనా తక్కువగా అంచనా వేసి ఉంటే అది వారికి కనువిప్పు కలిగించింది.

స్వేచ్ఛ, స్వాతంత్ర్యాలను కోరే ప్రజల్ని, వారి అభీష్టాల్ని—టాంకులతోను, బాంబులతోను అణగద్రొక్క లేరని— బంగ్లాదేశ్‌లో పాకిస్తానీయుల లొంగబాటు రుజువు చేస్తున్నది. సోషలిస్టు సిద్ధాంతాలకు కట్టుబడి సోవియట్ రష్యా మనతో నిలబడింది. అవసర పరిస్థితుల్లో తన స్నేహాన్ని సంఘీభావాన్ని మన పట్ల కనపరచింది.

పాకిస్థాన్‌కు రాజకీయపరమైన సహాయాన్ని మాత్రమే అందజేయగలదు చైనా! కాని, అది బయటికి రాని విధానంలోనే, చేస్తుంది. బయటపడితే అంతర్జాతీయ వ్యవహారాలు మరోరూపం దాలుస్తాయి. భారత రక్షణ శక్తి ఏవిధంగానూ అగ్ర రాజ్యాలకు తీసిపోదు అనే రుజువు కావలసి వుంది. మన రక్షణ సేనల నీతి, యుద్ధ తంత్రమూ చాలా ఉన్నత స్థాయిలో ఉన్నాయి. మన సేనల పోరాటం వెనక ఒక లక్ష్యమూ, బలమైన కారణమూ ఉంది. అందుకు దృఢ నిశ్చయంతో పోరాడి యుద్ధరంగంలో విజయాలను సాధించారు.

మరొక అతిముఖ్యమైన అంశం ఏమిటంటే: అంతర్జాతీయ రంగంలో అమెరికా తన ప్రతిష్టను కోల్పోయింది. అమెరికా సామ్రాజ్యవాదతత్వం ప్రపంచంలోని వ్యతిరేక శక్తులకు మాత్రమే తోడ్పడగలదనేది కూడా నిర్ధారణ అయింది. ఇంకా పెట్టుబడిదారీ వ్యవస్థనూ, సామ్రాజ్యవాద ధోరణినీ అనుసరించి కొనసాగుతున్న నిక్సన్ ప్రభుత్వం—ఇవాళ కాకపోతే రేపయినా పతనం తప్పదని అంతా భావిస్తున్నారు.'

## భుట్టో అధికారంలోకి వచ్చాక

'భుట్టో పాకిస్తాన్ ప్రెసిడెంట్ అయ్యారు గదా, అందువల్ల ఏర్పడగల పరిణామాల గురించి చెబుతారా ?' అని అడిగిన మరో ప్రశ్నకు శ్రీ జగ్గయ్య ఇలా అన్నారు. భుట్టో పాకిస్తాన్‌లో అధికారంలోకి రావటం ద్వారా యుద్ధం పూర్తిగా సమసిపోతుందని నేను అనుకోను. తన దేశంలోని మతావేశపరులైన కొన్నివర్గాల వారిని సంతృప్తిపరచటానికీ, తన ప్రజల దృష్టిని ఆకర్షించటానికీ, భుట్టో సైనిక శక్తుల్ని సమీకరించుకొని యుద్ధ ప్రయత్నాలకి తలపడతారు. జరిగిన యుద్ధంతో పాకిస్తాన్ ఆర్థిక వ్యవస్థ ఛిన్నాభిన్నమయింది. దీంతో మరింత నాశనమవుతుంది.

## మరింత జాగరూకత అవసరం

భారతప్రభుత్వం, భారత రక్షణ దళాలు, భారత ప్రజానీకం— సాధించిన విజయాలతో సంతృప్తిపడక, మరింత ధైర్యసాహసాలతో రానున్న ఎలాంటి విపత్తునైనా ఎదుర్కొనేందుకు సన్నద్ధులై ఉండాలి. ఎంతటి సవాలునైనా, ప్రతిఘటించేందుకు మరింత జాగరూకత అవసరం' అని కూడా చెప్పారు శ్రీ జగ్గయ్య.

—మోహన్ కుమార్

# పుస్తకాలు

రెండు నవలలు •

## ఆడ బ్రతుకు

శ్రీ పురాణం సూర్యప్రకాశరావు 134 పేజీలు

## పొడుపు కథ

రచన. శ్రీ కె. పి. బాబు. 112 పేజీలు. ఒక్కొక్కటి వెల రు. 2—లు ప్రతులకు: యం. శేషాచలం అండ్ కో, మచిలీపట్నం —మద్రాసు— సికింద్రాబాదు.

విద్యావతి, ఉద్యోగిని అయిన అనూరాధ పెళ్ళి సమస్య, ఆతరువాత ఆమె వైవాహిక జీవిత పరిణామం— ఈ నవలకు ప్రాతిపదికలు.

ఆడవాళ్ల అనుమానాలతో వేగలేమని మొర పెట్టుకుంటాడు మాధవరావు 'ఈ పాడు మొగాళ్ళ మనసులే అంత' అని వాపోతుంది భార్య సరస్వతి ఈ దంపతుల ప్రభావాలు అనూరాధ మనస్సుపైన పనిచేస్తాయి. వారివీరి మధ్య ఒక ప్రబలమైన లంకె సుభద్రమ్మ—విచిత్ర పరిస్థితులకు పాల్పడి 'అనాథ'గా ఎంచబడే ఒక ఇల్లాలు, ఆమెను నిర్లక్ష్యంగా గాలికి వదిలేసి దిలాసాగా కాలక్షేపం చేస్తున్న ఒక బోగస్ వ్యవహర్త భుజంగరావు— ఆవిడభర్త

వారాలు చేసుకుంటూ, బసమాత్రం అనూరాధ ఇంట్లో పెట్టుకొని చదువు సాగించిన బాబూరావే— ఎన్నో కలలు కన్న తరువాత ఎట్లా కేలక ఆమె భర్త అవుతాడు అయితే— బాబూరావంటే ససేమిర కిటుక, అతడి పేరు చెబితేనే మండిపడే గోపాలరావు అనూరాధకు అన్న, అనూరాధ జీవితంలో అడుగడుగునా అడ్డుతగిలే అవాంతరాలకు మనో వ్యథ పొందే ముసలి తండ్రి రమణారావు

ఈ పాత్రలలో దేనికదే అంత పొందికగా అమరి వుంది—కనుక ముఖ్యం అముఖ్యం అని విడమార్చటానికి వీల్లేదు. మనసుకి హత్తుకునే ముచ్చటయిన వన్ని వేశాలతో స్త్రీలమనస్తత్వాలు చక్కగా చిత్రింపబడ్డాయి. నాజూకయిన హంశాలను అతి సున్నితంగా మలచిన ప్రజ్ఞ, ప్రతిభ ఆద్యంతమూ కనిపిస్తుంది.

అనూరాధకు అనుమాన కారణమైన ఫోర్త్ రీ ఉత్తరం పరిశీలనతో కథ కడపటికి వస్తుంది చివరకు బాబూరావు ఇలా అంటాడు— 'ఎవరు రాశారో నాకిప్పుడు అర్థమయింది ఆస్వార్థపరుడెవరో నాకు బోధపడింది' అని చిత్రమైన ఈ సస్పెన్సు ముగింపు ఎంతో బాగుంది. చదివి తీర వలసిన నవల.

* *

నవలకి 'పొడుపుకథ' పేరు ఆకర్షణీయంగావుంది పిల్లలకూ కూడా నోరూరిస్తుంది అయితే— విడుపు అనుకున్నంత తేలికా? అనేది ఒక సమస్య.

ఎత్తుబడిపోయే కథకుల మన దృష్టి నిజంగా పెద్ద పెనకి మళ్లిస్తున్నారు. ఉజ్వలమైన సహాయ నిరాకరణోద్యమం నాటి ఉత్సాహం ప్రజాశక్తి, త్యాగ మహిమ ఒక్కమాటుగా గుర్తుకొస్తాయి.

కథలో శంకరం వంట త్యాగధనులు ఎందరెందరో ఉద్భవించా రానాడు. స్వాతంత్ర్యేచ్ఛ ఆబాల గోపాలానికీ నరనరాలలో వ్యాపించింది. స్వార్థమనే మాటను నిఘంటువు నించి తుడిచివేసి, త్యాగమనే గొప్పశక్తి రాజ్యై కూర్చుంది

ఇటువంటి రాజకీయ చైతన్యం దేశాన్ని వూపివేస్తున్న సమయంలో శంకరం తన విధిని, అ యంగా నిర్వర్తించాడు స్వదేశీ ఉద్యమం అతడి రక్తంలో కలసి ప్రవహించింది ఆ త్యాగ ఫలితంగా తన కుటుంబం అష్టకష్టాలూ పడవలసి వచ్చింది తప్పదు.

సందర్భోచితంగా, హరిజన బాలిక సుజనాదేవి వంట వ్యక్తుల్ని ప్రవేశపెట్టి గాంధి ఉద్యమాన్ని ఇంచు మించు సాంగోపాంగంగా చక్కటి రూపంలో చదువరులకు అందివ్వటంలో శ్రీ బాబు కృతకృత్యులయ్యారు

పొడిపొడిగా చరిత్రను చదవడం కంటే ఒక నవలా రూపంలో ఇటువంటి 'పొడుపు కథ'ను చదవటానికి ఎంతయినా కుతూహలంగా వుంటుంది ప్రకరణాల ముందు ఉపశీర్షికలు లేకపోతేనే బాగా ఉండును.

—శివకుమారి

## వసుచరిత్ర సాహితీ సౌరభము

రచయిత సరస్వతీ పుత్ర పుట్టపర్తి నారాయణాచార్యులు ప్రతులకు: శ్రీ రామరాజ భూషణ సాహిత్య పరిషత్తు, భీమవరం, పశ్చిమగోదావరి జిల్లా డెమ్మీ పుటలు 112 వెల అయిదు రూపాయలు

రామరాజ భూషణుని వసుచరిత్ర శ్లేష శబాలంకార ప్రధానమైన సుప్రసిద్ధ ప్రబంధము సంస్కృతాంధ్రాలలో లోతయిన పాండిత్యమున్నవారికి గాక, దీనిలోని శ్లేషలు చమత్కారాలు, వ్యంగ్యాలు, కవితాప్రౌఢిమ బోధపడవు ఈ ప్రబంధాన్నిగురించి ఉస్మానియా విశ్వవిద్యాలయం వారు నారాయణాచార్యులుగారిచేత మూడు ఉపన్యాసాలిప్పించారు శ్రీ రామరాజ భూషణ జిల్లా పరిషత్తువారు ఈ ఉపన్యాసాల్ని పుస్తకరూపంలో ప్రచురించారు.

ఈ ఉపన్యాసాలలో మొదటిది వసుచరిత్రలో శబ్దశ్లేష చమత్కారాలకు సంబంధించినది. ఇది ఈ ఉపన్యాసాలలో ఉలస్పర్శి అయినది మను చరిత్ర అనుకరణ లెన్నో వసుచరిత్రలో కాన వస్తున్నాయి అన్నివిధాల వసుచరిత్ర అతిక్రమించాలని రామరాజ భూషణుడు శాయశక్తులా ప్రయత్నించాడు. కాని కేవలం రసవత్కావ్యదృష్టితో చూసినప్పుడు వసుచరిత్ర మనుచరిత్రకన్నా మిన్న అనలేము అయితే వసుచరిత్రవారునిది అలంకార ప్రధానమయిన పాండిత్య దృష్టి కనుకనే ఈ ప్రబంధం నేటి విద్వాంసులకందరికి శిరోధార్యమయింది ఈ రెండు కావ్యాల పోలికలు తారతమ్యము చక్కగా వివరించారు నారాయణాచార్యులుగారు. ఇది రెండవ ఉపన్యాసంలో ముఖ్య విషయము.

పెనుగొండ పక్కనే ముత్యాల వంక అన్న చిన్న ఏరున్నది. అది ఒక కొండ నొరుసుకొని ప్రవహిస్తున్నది. రామరాజ భూషణుడు అది గమనించి తన ప్రబంధం రచించి ఉండవచ్చునని పుట్టపర్తి వారు ఊహిస్తున్నారు. ఇటువంటివే మరికొన్ని ఊహాలు మూడవ ఉపన్యాసంలో కాన వస్తున్నాయి. పాటకులు నీటితో ఏకీభవించక పోవచ్చును. కాని జాగ్రతగ పరిశీలించాల్సిన ఊహాలివి

నేటికాలం ఇటువంటి పరిశీలనలు చాలా స్వల్పంగా వెలువడతున్నాయి ఉస్మానియా విశ్వ విద్యాలయం వారే ప్రకటించదగిన చిన్న పుస్తకవిది గౌరవం దక్కించుకున్న రామరాజ పరిషత్తు వారు అభినందనీయులు.

—శాస్త్రి

## ఆద్యంతాలు— మధ్య రాధ

ఎమెస్కో ప్రచురణ— రచన: శ్రీ బుచ్చిబాబు పాకెట్ సైజు 138 పేజీలు వెల రూ. 2—50. యం. శేషాచలం అండ్ కో, మచిలీపట్నం మద్రాసు, సికింద్రాబాదు.

ఇదివరలో శ్రీ మునిమాణిక్యం వారి కాంతం కథలు మధ్య తరగతి కుటుంబాల్లోని సామాన్య సాంసారిక పరిస్థితులను వివరిస్తూ ప్రజాబాహుళ్యం ఆదరాభిమానాలను చూరగొన్నవి. ఈ పుస్తకం ఆ పద్ధతిలోనే రచించబడినట్లు దీని ధోరణిని బట్టి తెలుస్తున్నది దాని మాదిరిగానె యిదిన్నీ హాస్యరచన. కాంతం కథల్లో తన భార్య కాంతాన్ని గురించి భర్త చెప్పిన సంగతులు వర్ణించబడినవి. ఇందులో ఆద్యంతాలైన భార్యాభర్తలు సుందరం అన్నయ్య, శాంతమ్మ వదినల మధ్య రాధ నిలిచి వారి కుటుంబంలోని సంఘటనలను రసవంతంగా వివరిస్తుంది. కాంతమ్మకు ప్రతిరూపమే శాంతమ్మలా కనిపిస్తుంది. దాని మాదిరిగానె యిదీ హాస్య రచన. ఇది కూడా దానివలెనె పాటకుల హృదయాన్ని ఆకర్షిస్తుంది. కాని కాంతం కథలోని హాస్యం స్వాభావికం. ఇందులో ప్రయత్నపూర్వకంగా కానవస్తుంది. మాటలాడటంలో గొప్ప తెలివితేటలు చూపిస్తున్న శాంతమ్మ చేతల్లో మూఢురాలివలె ప్రవర్తించడం కొంత అస్వాభావికంగా కనబడుతుంది మరదలుపిల్ల రాధ సంభాషణ చాలా హుందాగా సాగింది

హాస్య ధోరణిని సంఘటనలు వర్ణించడంలో శ్రీ బుచ్చిబాబు చాలావరకూ కృతార్థులయ్యారనే చెప్పాలి. చికాకుగా ఉన్నప్పుడు మనస్సునకు కొంత ఉల్లాసం కలిగించడానికి ఈ పుస్తకం బాగా ఉపయోగిస్తుంది. దీన్ని తమ ప్రణాళికలో చేర్చి చక్కగా ముద్రింపించి ప్రకటించిన ఎమెస్కో వార్ని అభినందించాలి.

—అంగీరస ●

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Steert, Madras-1; and at Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3

# మిక్కిలి సరసమైన ధర కలిగిన డిటర్జెంటు బిళ్ల




**శ్రీమతిగారూ, ఇదిగో మీకోసం బోనస్**




టాటా
ఉత్పత్తి

బోనస్ నిజమైన బోనసు. బోనస్‌లో ఉతుకడు శక్తి బాగా నిండి ఉన్నది అందు చేత తక్కువ బోనస్, తక్కువ శ్రమతో ఎక్కువ బట్టలను అత్యంత తెల్లగా, కాంతివంతముగా 'ఉండేటట్లు ఉతకవచ్చును బోనస్ ఎటువంటి నీటిలోనైనా సరే అమితమైన నురుగు నిస్తుంది. ఎందువల్లనంటే బోనస్ ఉత్తమంగా ఉతికే డిటర్జెంటు—సబ్బు కాదు

ఉత్తమ ఫలితాలకు, బట్టలను బాగా నాన బెట్టండి. ఉపయోగించిన తరువాత బోనసును పొడి ప్రదేశంలో ఉంచండి.

**బట్టలను అత్యుత్తమంగా ఉతకటానికి నేడే వాడండి**

# బోనస్

—ప్రశస్తమైన డిటర్జెంటు

CMTB-9-244 TEL

